# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు




| | | |
|---|---|---|
| భారతచరిత్ర - 87 | .... | 2 |
| మతం గాని మతం | .... | 5 |
| శిథిలాలయం - 12 | .... | 9 |
| అజాతశత్రువు | ... | 17 |
| వెర్రివాళ్ళు | .... | 21 |
| కొత్త జీవితం | .... | 25 |
| నీటివిలువ | .... | 29 |
| అనేకహంతకులు | .... | 33 |
| దొంగల్లోదొంగ | .... | 39 |
| తెలివిగలపిల్ల | .... | 43 |
| దయ్యాలతోమైత్రి | .... | 45 |
| ఎవరుయువరాజు ? | .... | 47 |
| కృష్ణావతారం | .... | 49 |
| అరణ్యపురాణం | .... | 57 |


ఇవి గాక ఫొటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.




విడి ప్రతి
**75** పైసలు

సంవత్సర చందా
రూ. **9/-**

'మొనగాళ్ళకు మొనగాడు' సమర్పించిన మోడరన్ థియేటర్స్ వారి 106వ చిత్రం

# ఎవరు మొనగాడు?



దర్శకుడు ఆర్ సుందరం BE

నవయుగ విడుదల సౌత్ డిస్ట్రిబ్యూటర్స్ అనిత ప్రభాస్ ఎంటర్‌ప్రైసెస్




YOUR FAVOURITE SATHE PICNIC BISCUITS

Now available
in fancy
air-tight carton



SATHE BISCUIT & CHOCOLATE CO. LTD., POONA-2.

1-1-'69 తేది విడుదల!

తప్పక చూడండి!



పుణ్యదంపతులు శ్రీరామచంద్రమూర్తికి,
సీతాదేవికి వియోగమేల కలిగెను?
ఈ కథాసారాంశముతో "శ్రీమతి కల్యాణం"
ముఖ్యాంశము! అదే ......



పద్మనాభం సమర్పించు
రేఖా & మురళీ ప్రొడక్షన్స్



రామకథ

స్క్రీన్‌ప్లే దర్శకత్వం: పద్మనాభం

నిర్మాత: బి. పురుషోత్తం

వేటూరి - సంగీతం కోదండపాణి





# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

మంచితనం చూసి అమాయకత్వ మనో, అసమర్థత అనో కొందరు భ్రమ పడతారు. ఈ నీతి మనకు తరచు కథలలో కనబడుతుంది. ఇలాటి నీతే "అజాతశత్రువు" [బేతాళ కథ]లో కనిపిస్తుంది. అజాతశత్రువు అసమర్థు డని కళింగరాజు అపోహ పడతాడు. అతను ఆదర్శప్రాయుడైన రాజు. అందుచేత అతని ప్రజలు, ఆకస్మికంగా వచ్చి పడిన శత్రువును అవలీలగా జయిస్తారు. మంచి పరిపాలనగల రాజ్యం అజేయమని ఈ కథ నిరూపిస్తున్నది.

సంపుటి 43 డిసెంబర్ '68 సంచిక 6



CHITRA



బ్రిటిష్ ప్రభుత్వం అనేకమంది భూస్వాములల ఆస్తులు కాజేసి, వారి పై ఆధారపడినవారికి భుక్తిలేకుండా చేసింది. రాజుల అధికారాలు చాలావరకు హరించింది. తీవ్రమయిన ఆర్థికసంక్షోభం దేశంలో అనేక ప్రాంతాల బయలుదేరింది.

పాశ్చాత్యనాగరికతా ప్రభావం దేశంలో విస్తరించటం సనాతనవాదులు సహించలేకపోయారు. సతీ, భ్రూణహత్యలూ నిషేధించబడటం వారిని చాలా బాధించింది. 1856లో స్త్రీ పునర్వివాహం చట్ట సమ్మతమయింది. క్రైస్తవ మిషనరీలు భారతీయులను తమ మతంలోకి చురుకుగా చేర్చుకోసాగారు.

ఇలాటి అంశాలను గురించి ప్రజలలో ఎంత ఆందోళన ఉన్నప్పటికీ, సిపాయిలలో అసంతృప్తి చెలరేగకపోతే 1857 సంక్షోభం జరిగేదికాదు. కాని సిపాయిలలో కూడా బ్రిటిషుఅధికారుల పట్ల అసంతృప్తి కలుగుతూ వచ్చింది. వాళ్ళను అధికారులు యుద్ధాలకు దూరప్రాంతాలకు తీసుకుపోయి, దీర్ఘకాలం పోరాడించేవారు. అందుకుగాను అదనపు భత్యాలివ్వమంటే ఇచ్చేవారుకారు. ఈ కారణంగా సైనికులు 1844-1857 మధ్య కాలంలో నాలుగు పితూరీలు జరిపారు.



ఈ స్థితిలో రైఫిల్ తూటాలు వచ్చి అగ్గికి ఆజ్యంపోశాయి. అప్పుడే ఎన్‌ఫీల్డ్ రైఫిల్ సైన్యంలో ప్రవేశపెట్టబడింది. దాని తూటాలకు జంతువుల కొవ్వు పూశారు. ఈ కొవ్వు గోవులకూ, పందులకూ చెందినదని సిపాయీలు పసికట్టారు. దాన్ని హిందువులూ, ముస్లిములూ సహించలేకపోయారు. నానా సాహెబ్, ఝాన్సీరాణి మొదలైనవారు, అసలే రెచ్చి ఉన్న సిపాయీలను మరింత రెచ్చగొట్టారు.

1857 తిరుగుబాటు తాలూకు తొలి చిహ్నాలు మొట్టమొదట బారాక్‌పూర్, బర్‌హాంపూర్ (బెంగాలు) లలో కనిపిం

చాయి. కాని ఈ ప్రాంతాలలో తిరుగుబాటు చేసిన వారిని శిక్షించి, ప్రభుత్వం తిరుగుబాటును అణచగలిగింది. అయితే 1857 మే 10 న మీరట్‌లో సిపాయిలు బహిరంగమైన తిరుగుబాటు చేశారు.

మీరట్‌లోని బ్రిటిషు ఉన్నత సైనికాధికారి అసమర్థుడు. తనకింద 2,200 మంది తెల్లసైనికులుండి కూడా, అతను తిరుగుబాటుదార్లను నిగ్రహించటానికి ఎలాటి యత్నమూ చెయ్యలేదు. తిరుగుబాటుదార్లు గుర్రాల మీద గాలప్ చేస్తూ మర్నాడు ఉదయానికల్లా ఢిల్లీ చేరి, దాన్ని స్వాధీన పరుచుకున్నారు. అక్కడ ఒక్క తెల్ల సైనికదళం కూడా లేదు. అక్కడ వారు అనేకమంది తెల్లవాళ్ళను వధచేసి, వారి ఇళ్ళను ధ్వంసం చేశారు.

ఢిల్లీనగరం వెలపల ఉన్న టెలిగ్రాఫ్ ఆఫీసులోని ఇద్దరు సిగ్నలర్లు పంజాబులోని అధికారులకు టెలిగ్రాఫ్ ద్వారా వార్త అందించారు. ఢిల్లీలోని ఆయుధాగారంలో లెఫ్టినెంట్ విల్లబీ, ఎనిమిదిమంది అనుచరులూ ఉన్నారు. వాళ్ళు కొద్ది రోజుల పాటు పోరాటం సాగించి, శక్తి చాలక, ఆయుధాగారాన్ని పేల్చేశారు. ఇందువల్ల తిరుగుబాటు దార్లకు నష్టం జరిగింది. అయినా వారు రాజభవనాన్ని తమ అధీనం చేసుకుని, రెండవ బహదుర్ షాను హిందూస్థానానికి చక్రవర్తిగా ప్రకటించారు. అప్పటికి బహదుర్ షా వయసుమళ్ళినవాడు, క్షీణించిన మొగలుసామ్రాజ్యానికి నామమాత్రపు రాజు.

బ్రిటిషువారు ఢిల్లీని స్వాధీన పరచుకోవటానికి ఎంతో యుద్ధం చెయ్యవలిసి వచ్చింది, ఎన్నో రాజకీయ తంత్రాలు పన్నవలిసి వచ్చింది. అలాటి పరిస్థితిలో ఢిల్లీ తిరుగుబాటుదార్ల అధీనం కావటం బ్రిటిషు సామ్రాజ్యానికి ఎంతో పెద్ద అఘాత అయింది.





# మఠంగాని మఠం

పూర్వం ఒక గొప్ప సుల్తాను ఉండేవాడు. ఆయన పరిపాలనలో రాజ్యం ఎంతో సంపన్నంగా వుండేది. ప్రజల నుంచీ, వర్తకుల నుంచీ పన్నుల రూపంలో ఖజానాకు కోట్లకొద్దీ మొహరీలు చేరాయి. అందుచేత సుల్తాను ఎక్కడెక్కడి నుంచో గొప్పగొప్ప శిల్పులను రప్పించి, అపురూపమైన మహల్ ఒకటి కట్టించి, దాని నిండా నవరత్నాలు పొదిగించాడు.

ఆ మహల్ ఖ్యాతీ, సుల్తాను కీర్తీ దేశదేశాలా వ్యాపించాయి. మహల్ నిర్మాణం చూసి ఆనందించటానికి దూరదేశాల నుంచి యాత్రికులు తీర్థప్రజగా వచ్చేవారు. కవులు మహల్ సౌందర్యాన్ని వర్ణిస్తూ పద్యాలు రాశారు. చిన్నచిన్న రాజులు దానిలోని శిల్పాలనూ, రచనా విధానాన్నీ అనుకరిస్తూ చిన్న సైజు భవనాలు నిర్మించ యత్నించారు. ఇలాటి అనుకరణలు జాస్తి అయిన కొద్దీ, అసలు భవనం ఖ్యాతి మరింత హెచ్చింది.

మహల్ నిర్మాణం పూర్తి అయినాక దానిని కట్టించిన సుల్తాను ఇరవైఏళ్ళు జీవించాడు. ఆ భవనంలో జీవించిన ప్రతి ఘడియా ఆయనకు స్వర్గంలో ఉన్నంత సంతృప్తి నిచ్చింది. చివరకు ఆయన ఆఖరు క్షణంలో తన కొడుకును పిలిచి, "నాయనా, నా సర్వశక్తులూ ధారపోసి ఈ మహలు కట్టించాను. దీని ద్వారానే నా జన్మ సార్థకమయింది. దీనితో నా కెంతో కీర్తి వచ్చింది. నేను నీకు రాజ్యంతో బాటు ఈ మహలును కూడా యిచ్చి పోతున్నాను. కాని నువు మాత్రం రాజ్యం కన్న కూడా దీన్ని మరింత శ్రద్ధగా చూసుకో. ఈ ఇరవై ఏళ్ళపాటూ నే నీ మహలును అభివృద్ధి చేస్తూనే వచ్చాను. నాతోబాటే దీని అభివృద్ధి ఆగిపోయిందనే మాట రానివ్వకు.

ఆర్. సూర్యారావు



ఈ ఖర్చుతో ఖజానా దాదాపు ఖాళీ అయింది. పాత సుల్తానుగారి హయాంలో ఉన్నంత సుభిక్షంగా ఇప్పుడు దేశం లేదు. వర్తకం ఇంకా సాగుతూనే ఉన్నదిగాని, వెనకటి ఓడవ్యాపారాలు లేవు, వెనకటి కోటీశ్వరులూ లేరు. పరిపాలన విషయాలలో సుల్తానుకు శ్రద్ధ కూడా అంతగా లేదు. అతని దృష్టి ఎంతసేపూ రాజభవనం పరిసరాలు అభివృద్ధి చెయ్యటం మీదే ఉండిపోయింది.

రెండోసుల్తాను కూడా పాతికేళ్ళపాటు పరిపాలించి చనిపోతూ, తన కొడుకైన అబ్దుల్లా అనేవాణ్ణి పిలిచి, "నాయనా, మన దేశం ఒకప్పుడు కవులకూ, శూరులకూ, వాణిజ్యానికీ పేరుమోసింది. కవులూ, శూరులూ, వర్తకులూ అందరూ పోయారు. కాని సాటిలేని మహల్ చిరంజీవిగా నిలిచి ఉన్నది. మీ తాత కట్టించిన ఈ మహలును నేను ఎంతో అభివృద్ధి పరిచాను. నా అనంతరం నువు కూడా దీని అభివృద్ధి కోసం పాటుబడి, మన వంశ ప్రతిష్ఠకు భంగం కలగకుండా చూడాలి,"

నీ యావచ్ఛక్తినీ వినియోగించి దీన్ని ఇంకా అభివృద్ధి చేసి, నా కన్న కూడా హెచ్చు కీర్తి తెచ్చుకో. అలా అయితే నా ఆత్మ సంతోషిస్తుంది," అని చెప్పి ప్రాణాలు వదిలాడు.

సుల్తాను కొడుకైన కొత్తసుల్తాను తండ్రి చెప్పినట్టే చేశాడు. తండ్రి కట్టించిన మహలు చుట్టూ విస్తృతమైన తోట వేయించాడు. అందులో అక్కడక్కడా చలవరాతి తిన్నెలూ, మండపాలూ, జలాశయాలూ నిర్మించి, మహలు పరిసరాలన్నీ ఎంతో మనోహరంగా తయారు చేయించాడు. దీనికంతకూ అంతులేని ఖర్చయింది.

అని హెచ్చరించి కన్ను మూశాడు.

సుల్తాన్ అబ్దుల్లా గద్దె ఎక్కే నాటికి ఖజానాలో చిల్లిగవ్వ మిగలలేదు. డబ్బు

లేకుండా మహలును భరించటమే సాధ్యం కాదు, ఇక అభివృద్ధి మాట అడిగే దేమిటి?

అందుచేత అబ్దుల్లా తన వజీర్ల సలహాతో కొత్త కొత్త పన్నులు ప్రజల మీద విధించ సాగాడు. రోజురోజుకూ పన్నుల భారం పెరిగిపోతుంటే, అసలే దారిద్ర్యంతో బాధపడే ప్రజలు తట్టుకోలేక హాహాకారాలు చెయ్యసాగారు. ఒక వంక వసూలవుతున్న డబ్బును సుల్తాను ప్రజల కోసం వినియోగించక, మహల్ చుట్టూ వున్న తిన్నెలను పడగొట్టి మరింత పెద్ద తిన్నెలు చేస్తున్నాడు, జలాశయాలను పూడ్పించి కొత్తవి నిర్మిస్తున్నాడు. దేశంలో అరాజక పరిస్థితి ఏర్పడింది.

ఈ సమయంలో ఆ దేశానికి ఎక్కడి నుంచో ఒక ఫకీరు వచ్చాడు. ఆయన ప్రజలతో మాట్లాడి, వారి ఆందోళనకు కారణం గ్రహించాడు. "సుల్తానుగారికి జ్ఞానం లోపించింది. కాస్త కళ్ళు తెరవాలి," అనుకుని తిన్నగా రాజభవనానికి వచ్చి, దర్వానులతో మాట్లాడకుండా లోపలికి వెళ్ళిపోయాడు. ఫకీరును ఆపే సాహసం వాళ్ళకు లేకపోయింది.

ఫకీరు పాకశాలకు వెళ్ళి కూర్చుని, "భోజనం పెట్టండి," అని వంటవాళ్ళను ఆజ్ఞాపించాడు. వాళ్ళు మారు మాట్లాడక వడ్డించారు. ఫకీరు భోజనం ముగించి,





రాజుగారి పడకగదికి వెళ్ళి, హంసతూలికా తల్పం మీద పడుకుని నిశ్చింతగా నిద్ర పోసాగాడు.

ఫకీరెవరో రాజభవనం ప్రవేశించాడని తెలిసి అబ్దుల్లా వచ్చి చూస్తే ఫకీరు సుఖ నిద్రలో ఉన్నాడు. అతను ఫకీరు నిద్ర లేచినదాకా వేచి ఉండి, "ఫకీర్ల కోసం మంచి మఠం ఏర్పాటు చేశామే. అక్కడికి వెళ్ళకపోయారా?" అని అడిగాడు.

"ఇది మఠం కాదా ఏం?" అన్నాడు ఫకీరు తొణకకుండా.

"కాదు. ఇది రాజభవనం. మా తాత గారు నిర్మించారు. ఆయన తరం నుంచీ మేం ఇందులోనే ఉంటున్నాం," అన్నాడు అబ్దుల్లా.

"మీ తాతగారు ఇందులో ఎంత కాలం ఉన్నారు?" అని ఫకీరు అడిగాడు.

"ఇరవై సంవత్సరాలు," అన్నాడు అబ్దుల్లా.

"మీ తండ్రిగారు?" అని ఫకీరు మళ్ళా అడిగాడు.

"యాభై సంవత్సరాలు," అన్నాడు అబ్దుల్లా.

"నువ్వెంత కాలంగా ఉంటున్నావు?" అని ఫకీరు అడిగాడు.

"నేను పుట్టినప్పటి నుంచీ ఇందులోనే ఉంటున్నాను," అన్నాడు అబ్దుల్లా.

"ఇప్పుడు నీ వయసెంత, బాబూ?" అన్నాడు ఫకీరు.

"ముప్పై ఏళ్ళు," అన్నాడు అబ్దుల్లా.

"పూర్ణాయుర్దాయం ఉంటే ఇంకో డెబ్భై ఏళ్ళు ఇందులో ఉంటావన్న మాట. ఈ మాత్రానికే ఇది మఠం కాదంటావేం? ఈ మఠం కోసం ప్రజలందరినీ పన్నులతో పీడించుకుతింటున్నావా? ఎంత తప్పు!" అంటూ ఫకీరు లేచి వెళ్ళిపోయాడు.

అబ్దుల్లాకు జ్ఞానోదయమై, ప్రజల క్షేమం కోరి పరిపాలించటం ప్రారంభించాడు.






# శిథిలాలయం

## 12

[శిఖిముఖీ, విక్రమకేసరీ పూజారి దాగి వున్న గుహ దగ్గిరకు వెళ్ళారు. కాని, అతడు అందులో లేడు. సవర భేరుండాన్ని వెంటబెట్టుకుని పూజారి కొండ దిగి లోయ కేసి పోతూండటం వాళ్ళకు కనిపించింది. శిఖిముఖీ వాళ్ళు అతణ్ణి వెంబడించారు. పూజారి లోయలో వున్న గండశిలలను శిఖిముఖికి చూపి, అక్కడికి రమ్మన్నాడు. తరువాత—]

శిథిలాలయ పూజారి మాటలు, శిఖిముఖీ వాళ్ళకు చాలా కోపాన్ని తెప్పించినై. వాళ్ళు వేగంగా లోయలోకి దిగి, రాళ్ళ ముందు నిలబడి వున్న పూజారీ, సవరభేరుండాల్ని సమీపించేంతలో, రాళ్ళ వెనక నుంచి దాదాపు పదిమంది చెంచులు పెద్దగా కేకలు పెడుతూ ముందుకు దూకారు. వాళ్ళ నాయకుడు ఒక గుర్రం మీద రాతి చాటు నుంచి ముందుకు వచ్చి, "ఎవరు? శిఖిముఖీ, నాగుమల్లులా? శబర, సవర నాయకుల పిల్లలన్నమాట! మీరు నా బందీలు. మీ తండ్రులు ఏ పాటి ధనం యిచ్చి మిమ్మల్ని విడిపించుకు పోతారో చూస్తాను," అన్నాడు.

"భేష్, బావుంది! అదీ అసలు కథ! ఇందులో నేనెలాంటి జోక్యం కల్గించుకోను, అర్థమైందా, శిఖీ!" అంటూ పెద్దగా నవ్వాడు శిథిలాలయ పూజారి.



"వాడు చెంచు బందిపోట్ల నాయకుడు, బడేచెంచు, కేసరీ!" అన్నాడు శిఖిముఖి ఈటె ఎత్తుతూ.

"ఇది పూజారి దుర్మార్గుడు మన కోసం పెట్టిన మాటు!" అన్నది నాగుమల్లి ఈటె ఝళిపిస్తూ.

విక్రమకేసరి ఏమీ జవాబివ్వకుండా మెరుపులా ముందుకు దూకి, బడేచెంచు తల మీద ఈటెతో బలంగా ఒక దెబ్బకొట్టి, ఆ దెబ్బకు చెంచు గుర్రం మీది నుంచి కింద పడుతూండగానే, గుర్రం కళ్ళాన్ని గట్టిగా పట్టుకుని, "శిఖీ, మల్లీ! మాటల్తో కాలయాపన ప్రమాదం. మీ రిద్దరూ దీన్నెక్కి పారిపోండి. పూజారి మీ కోసమే యింత దుష్టతంత్రం పన్నాడు," అంటూ శిఖిముఖిని భుజం పట్టుకుని ముందుకు లాగి, బలవంతంగా గుర్రం ఎక్కించాడు. నాగుమల్లి ఏదో అభ్యంతరం చెప్పబోయింది. కాని విక్రమకేసరి ఆమెకు అవకాశం యివ్వకుండా, పడిసి పట్టుకుని శిఖిముఖి వెనక గుర్రం మీద ఎక్కించి, గుర్రాన్ని డొక్కలో గట్టిగా ఒక్క తన్ను తన్నాడు.

ఇదంతా కన్నుమూసి తెరిచేంతలో జరిగి పోయింది. బడేచెంచు అనుచరులు తెప్పరిల్లి కేకలు పెడుతూ ముందుకు వచ్చే లోపలే శిఖిముఖీ, నాగుమల్లీ ఎక్కిన గుర్రం లోయలో పరిగెత్తసాగింది. నేల మీద పడ్డ బడేచెంచు అబ్బా అంటూ లేచి నిలబడి, "మీరు ఆ గుర్రం మీద వెళ్ళే వాళ్ళను పట్టుకోండి. యీ చవటల సంగతి నేనూ, పూజారి ప్రభువూ చూస్తాం," అన్నాడు.

చెంచులు ఐదారుగురు అరుస్తూ గుర్రం వెనక పరిగెత్తారు. శిథిలాలయ పూజారి అక్కడ నిలబడి వున్న మిగతా చెంచులతో, "ఈ విక్రమకేసరిని ప్రాణాలతో పట్టుకోండి. శిథిలేశ్వరీదేవికి బలి పెట్టటానికి యింతకంటె అర్హుడు యీ భూప్రపంచంలో దొరకడు," అన్నాడు పళ్ళు కొరుకుతూ.



విక్రమకేసరి తన ముగ్గురు అనుచరులనూ హెచ్చరించి, ఒక్కొక్క అడుగే వెనక్కు వేస్తూ, కొండ కేసి కదలసాగాడు. చెంచులు భయంకరంగా కేకలు పెడుతూ వాళ్ళను చుట్టు ముట్టేందుకు ముందుకురికారు.

"బడేచెంచూ, నువ్వు పెద్ద పొరపాటు చేశావు. నీ వాళ్ళను మరో ఇరవై మందిని వెంట తెస్తే పని సానుకూల మయేది. ఈ విక్రమకేసరి మహా పొగరుబోతు. గాయ పరచకుండా అతణ్ణి పట్టుకోపటం సాధ్యం కాదు. శిథిలేశ్వరీదేవికి క్షతగాత్రుణ్ణి బలి పెట్టటం గొప్ప అపచారం. అందువల్ల మనం ప్రస్తుతానికి యీ విక్రమకేసరిని వదిలి మన నివాసాలకు పోవటం ఉత్తమం," అన్నాడు పూజారి.

"పూజారి ప్రభూ! చూడండి, వాడు నా వాళ్ళను రాళ్ళ చుట్టూ ఎలా గిరికీలు తిప్పుతున్నాడో. తమరొక పని చేయకూడదా? మంత్రం ప్రయోగించి వాడి కాళ్ళూ చేతులూ ఆడకుండా బంధించండి," అన్నాడు బడేచెంచు.

ఆ మాటలకు పూజారి పెద్దగా నవ్వుతూ, "నా మహా మంత్రశక్తిని యీ హీనుణ్ణి పట్టుకునేందుకు ప్రయోగించటమా? ఎంత మాటన్నావు, చెంచూ! పొరబాటు, పొర



బాటు. నే చెప్పినట్టు చెయ్యి. నీ వాళ్ళను తిరిగి రమ్మను. కావాలంటే వాళ్ళను కూడా ఆ శిఖిముఖీ, నాగుమల్లులను పట్టుకునేందుకు పంపు," అన్నాడు.

"చిత్తం, పూజారి ప్రభూ, చిత్తం!" అంటూ బడేచెంచు తలవంచి పూజారికి సమస్కరించి, విక్రమకేసరితో పోరుతున్న తన అనుచరులను తిరిగి రావలసిందిగా పెద్ద కేక పెట్టాడు. ఆ కేక వింటూనే చెంచులు బతుకుజీవుడా అనుకుని, విక్రమకేసరి వల్ల గాయపడిన తమవాణ్ణొకణ్ణి భుజాన వేసుకుని, తమ నాయకుడి వద్దకు తిరిగి వచ్చారు.







"కావొచ్చు, పూజారి దొరా! మనకీ కోతి వెధవల్తో పనేం? చక్కా బ్రహ్మపుత్రా నదీ లోయలను వెళ్ళిపోదాం. బయలుదేరండి. ఊఁ ఎగరమన్నారా, ఆకాశంలోకి?" అంటూ నవరభేరుండం చేతులు పైకీ కిందికీ ఆడించసాగాడు.

పూజారి, భేరుండం మెడ మీద ఒక్క చరుపు చరిచి, "ఎగరటానికి వేళాపాళా లేదా? ఇది వాయసవేళ; భేరుండాలు యీ వేళప్పుడు పై కెగరలేవు, నేల నంటి పెట్టుకుని వుండాల్సిందే, తెలిసిందా? ఇక నోరు మూసుకుని బుద్ధిగా వెంటరా," అంటూ బయలుదేరాడు.

"పూజారి ప్రభూ! ఇక మనం మన ఆకాశ గుహకు వెళదామా? నా వాళ్ళు ఆ శిఖిముఖినీ, నాగుమల్లినీ అక్కడికే పట్టుకు వస్తారు. నా తలదిమ్ము యింకా వదల్లేదు," అన్నాడు బడేచెంచు.

"అలాగే వెళదాం. కాని...నీ వాళ్ళు వాళ్ళిద్దర్నీ పట్టుకోగలరా అన్న సంశయం నాక్కలుగుతున్నది. నేనీ ప్రాంతాలకు వచ్చినప్పటి నుంచీ, ఎందుకనో అన్నీ విఘ్నాలే ఎదురవుతున్నవి. వింధ్యకు దక్షిణాన శిఖిలేశ్వరీదేవి ప్రభావం అంతగా చెల్లుబడి అవుతున్నట్టు కనబడదు," అన్నాడు పూజారి నిస్పృహగా.

చెంచు నాయకుడి వెంట పూజారీ తతిమ్మా చెంచులూ అతడి నివాసమైన ఆకాశ గుహకు బయలుదేరారు. అదే సమయంలో విక్రమకేసరి తన వెంటవున్న శబరులతో కలిసి, శిఖిముఖి, నాగుమల్లులు గుర్రం మీద పారిపోతున్న లోయప్రాంతం కేసి పరిగెత్తసాగాడు. అతడికి గుర్రం మీద వున్న వాళ్ళిద్దరూ, వాళ్ళను పట్టుకునేందుకు వెనకగా పరిగెత్తుతున్న చెంచులూ కనబడుతూనే వున్నారు. గుర్రం ఎగుడు దిగుడుగా వున్న ఆ ప్రాంతాల వేగంగా పరిగెత్తలేక పోతున్నది. అది అవకాశంగా తీసుకుని





చెంచులు దాన్ని చుట్టు ముట్టేందుకు ప్రయత్నిస్తున్నారు.

విక్రమకేసరి పెద్దగా, "శిఖి, మల్లీ! మేం వస్తున్నాం. పూజారీ, బడేచెంచూ పారిపోయారు," అని కేకలు వేస్తూ వారి కేసి పరిగెత్తసాగాడు. కాని, అతడు వాళ్ళను సమీపించే లోపలే యిద్దరు ముగ్గురు చెంచులు మిత్తానుంచి విడివడి, అడ్డదారిన రాళ్ళ మీదుగా దూకుతూపోయి, ముందు వైపునుంచి గుర్రం దారిని అటకాయించారు.

శిఖిముఖి కత్తితోనూ, నాగుమల్లి ఈటెతోనూ ఆ చెంచులు గుర్రాన్ని సమీపించకుండా ఆప సాగారు. ఒకటి రెండు నిమిషాల తరవాత శిఖిముఖి గుర్రం కళ్ళాన్ని గట్టిగా పట్టుకుని పక్కకు లాగి, దాన్ని లోయలో నుంచి కొండ మీదికి ఎక్కించసాగాడు. అతడికి విక్రమకేసరి కేకలు వినిపించినై. కేసరి కొండ మీది నుంచి తన కేసి దిగి వస్తున్నాడని అతడు భావించాడు.

శిఖిముఖి గుర్రాన్ని కొండ మీదికి ఎక్కించే ప్రయత్నం గమనిస్తూనే, ఒక చెంచు అటుగా పరిగెత్తి గట్టిగా చప్పట్లు చరుస్తూ, దాన్ని బెదరకొట్ట సాగాడు. గుర్రం



కొంచెంగా బెదిరి వెనక కాళ్ళమీద లేచింది. ప్రమాదాన్ని గుర్తించిన నాగుమల్లి తన చేతిలోని ఈటెను చెంచువాడి కేసి విసిరింది. కాని, చెంచు ఆ దెబ్బ తప్పుకుని మరింత గట్టిగా చప్పట్లు చరుస్తూ, గావు కేకలు పెట్టసాగాడు.

శిఖిముఖీ, నాగుమల్లులకు రానున్న ప్రమాదాన్ని గుర్తించిన విక్రమకేసరి చప్పున వడిసెల వున్న శబరుణ్ణి దగ్గిరకు పిలిచి, "బాగా గురిచూసి ఒక్క దెబ్బతో గుర్రం ముందున్న చెంచువాణ్ణి కింద పడ కొట్టాలి. ఆ వెనక పరిగెత్తు కొస్తున్నవాళ్ళ సంగతి తరవాత చూద్దాం," అన్నాడు.






శబరుడు వడిశెలలో రాయి పెట్టి, దాన్ని గిర్రున రెండుసార్లు తిప్పి, చెంచు మీదికి విసిరాడు. అది జుయ్ఁ మంటూ పోయి గుర్రాన్ని అడ్డగిస్తున్న చెంచు గుండెలను బలంగా తాకింది.

ఆ దెబ్బకు వాడు అరుస్తూ నేల మీది నుంచి అంతెత్తు ఎగిరి దభీమంటూ కిందపడి గుర్రం కేసి దొర్లుకుంటూ పోయాడు. గుర్రం బెదురుకుని గిర్రున వెనుదిరుగబోయి, వెనక కాళ్ళకింద వున్న గులకరాళ్ళు పట్టు తప్పి జారటంతో పక్కకు పడి, ఏటవాలుగా వున్న కొండమీది నుంచి దిగువకు దొర్లుకు పోసాగింది. గుర్రంతో పాటు కిందపడిన



శిఖిముఖి, నాగుమల్లులు కూడా కిందికి దొర్లుకు పోయారు.

చెంచువాళ్ళు యీ దృశ్యం చూస్తూనే, సంతోషం పట్టలేక పెద్దగా చప్పట్లు చరిచి కేకలు పెడుతూ, "పట్టుకోండి, పట్టుకోండి," అంటూ శిఖిముఖీ, నాగుమల్లుల కేసి పరిగెత్తారు. వాళ్ళు శిఖిముఖి వాళ్ళను సమీపించే లోపలే విక్రమకేసరి బాణం ఎక్కుపెట్టి గుంపు మధ్యకు వదిలాడు. బాణం ఒక చెంచును తాకింది. వాడు ఒక్క చావుకేక పెట్టి కిందపడి పోయాడు. అంతలో శిఖిముఖి లేచి నిలబడి తనను పట్టవచ్చే చెంచువాణ్ణి ఒక్క తన్ను తన్ని, అతడి చేతిలోని ఈటెను లాక్కున్నాడు.

కాని, యీ లోపల గుర్రం మీంచి కింద పడటంవల్ల గట్టి దెబ్బ తగిలి స్పృహ కోల్పోయిన నాగుమల్లిని, ఇద్దరు చెంచులు భుజాలమీద వేసుకుని లోయకు అడ్డంపడి పరిగెత్తసాగారు. తతిమ్మా చెంచులు ఓ క్షణకాలం శిఖిముఖిని ప్రతిఘటించి, దూరం నుంచి పరిగెత్తుకు వస్తున్న విక్రమకేసరినీ, శబరుణ్ణీ చూసి, యిక లాభం లేదనుకుని తాము కూడా లోయలోకి పారిపోయి, చూస్తూండగానే రాళ్ళ వెనక మాయమయారు.



శిఖిముఖి, విక్రమకేసరి కేసి చేయి వూపి రాళ్ళ వెనుకకు పారిపోయిన చెంచుల వెంట పడ్డాడు.

కాని, అతడు గుర్రం మీది నుంచి పడ్డ పాటుకు మోకాలు కొంచెం బెణకటంతో, వాళ్ళ ననుసరించి వేగంగా పరిగెత్తలేక పోయాడు. ఆ దశలో విక్రమకేసరి వచ్చి అతణ్ణి కలుసుకున్నాడు.

"కేసరీ! పెద్ద ఘోరం జరిగిపోయింది. ఇంత మందిమి వుండి, నాగుమల్లిని రక్షించలేక పోయామంటే ఆమె తండ్రే కాదు, మా అయ్య కూడా మనల్ని— ముఖ్యంగా నన్ను అసహ్యించుకుంటాడు. మనం చెంచు మూకతో యుద్ధం చేయకుండా నాగుమల్లిని రక్షించలేం. నువ్వు గూడేనికి పోయి మనవాళ్ళను పాతికా ముప్పై మందిని వెంటబెట్టుకు రా. ఈ లోపల నేను కాలిజాడలను బట్టి పోయి, ఈ చెంచులు మల్లిని ఎక్కడికి తీసుకు పోతున్నదీ గమనిస్తాను," అన్నాడు శిఖిముఖి.

విక్రమకేసరి ఏదో అభ్యంతరం చెప్పబోయాడు గాని, శిఖిముఖి వినిపించుకోక, అతణ్ణి వేగిర పెట్టాడు. విక్రమకేసరి చేసేది లేక ఒక శబరుణ్ణి శిఖిముఖి వెంట వదిలి, తతిమ్మా యిద్దరితో గూడేనికి బయలుదేరాడు.

శిఖిముఖి, చెంచులు పోయిన మార్గాన్ని కాలిజాడల వల్ల గుర్తిస్తూ, ఓ అరగంట తరవాత కొండపాదంలో వున్న ఒక అరణ్య ప్రాంతాన్ని చేరాడు. అతడికి చెట్లచాటు నుంచి ఏవో గొంతులు వినిపించినై. అతడు వెంటవున్న శబరుణ్ణి నిశ్శబ్దంగా వుండమని హెచ్చరించి, దాపుల నున్న ఒక చెట్టు ఎక్కి దిగువకు చూశాడు. చెట్లల్లో ఒక చోట పులిబోను ఒకటి వున్నది. చెంచులు నాగుమల్లిని దాని కేసి మోసుకు పోతున్నారు. —(ఇంకా వుంది)






# అజాత శత్రువు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నిన్నీస్థితిలో చూసినవాళ్ళు, అజాతశత్రువును చూసి కళింగుడు భ్రమపడినట్టే, వట్టి అసమర్థుడ వని భ్రమపడతారు. శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకు అజాతశత్రువు కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం తూర్పు చాళుక్య రాజులలో ఒక రాజు ఉండేవాడు. ఆయన చాలా శాంతస్వభావుడు. ఆగ్రహమన్నది ఆయనలో ఏ కోశానా కనిపించేది కాదు. దయాగుణం మటుకు అనుక్షణమూ కనిపించేది. నేరస్థులను దండించటం రాజుకు నిత్యకృత్యాలలో ఒకటి. అయినప్పుడు కూడా

## బేతాళ కథలు



ఆయన ఎవరికీ, ఎన్నడూ నేరానికి మించిన శిక్ష ఇచ్చి ఎరగడు. ఆయన చేత శిక్ష పొందినవాళ్ళు కూడా ఆయన దయా గుణాన్ని ఎంతో మెచ్చుకునేవారు. ఇలాటి గుణాలు కలవాడు కావటం చేత ఆయనకు అజాతశత్రువు అనే బిరుదు ఏర్పడి పోయింది. క్రమంగా అదే ఆయన పేరు కింద మారిపోయింది.

అజాతశత్రువు పాలించే రాజ్యాన్ని ఆను కునే కళింగరాజ్యం ఉండేది. కళింగుడు స్వభావతః దుర్మార్గుడూ, అసూయా పరుడూ, అహంకారీ కూడానూ. అతని పరిపాలన కూడా అస్తవ్యస్తంగా ఉండేది.

కళింగరాజ్యంలో బతకలేని పండితులూ, విద్వాంసులూ అజాతశత్రువును ఆశ్రయించి సుఖంగా జీవించటమే గాక, ఖ్యాతీ, ప్రతిష్ఠా సంపాదించుకున్నారు. చిన్నచిన్న వృత్తుల వాళ్ళు కూడా కళింగం నుంచి వలసవచ్చి, అజాతశత్రువు రాజ్యంలో హాయిగా స్థిర పడిపోయారు.

ఇదంతా కళింగుడు సహించలేక పోయాడు. అజాతశత్రువును అందరూ వేనోళ్ళ పొగడుతూ ఉండటం కూడా కళిం గుడికి బాధ కలిగించింది. కళింగానికి సరి హద్దున ఉన్న అజాతశత్రువు రాజ్యంలోని గ్రామాలపై కళింగుడి భటులు అప్పు డప్పుడూ దాడులు చేసి, ప్రజల చేత చావు దెబ్బలు తినివస్తూ ఉండేవాళ్ళు. ప్రజలకు దొరికిపోయినవాళ్ళు కూడా ఆటే శిక్ష పొంద కుండానే తిరిగివచ్చేవాళ్ళు.

పాలకుడుగా ఎంత కీర్తి తెచ్చుకున్నా అజాతశత్రువు యుద్ధంలో తనకు చాలడని కళింగుడికి కొక అభిప్రాయం కలిగింది. ఎందుచేతనంటే అజాతశత్రువు తన పొరు గున ఉన్న ఏ చిన్న రాజ్యాన్ని కూడా కనీసం బెదిరించినట్టు కూడా కనబడలేదు. ఎంతసేపూ పరిసర రాజుల మైత్రి మాత్రమే కోరేలాగ కనబడేవాడు.



అలాటి అసమర్థుడి పైన ఆకస్మికంగా దాడి చేసి, అతను సైన్యాలను అయత్తం చేసుకునే లోపుగా రాజధాని ఆక్రమించి, అజాతశత్రువును హతమార్చి, రాజ్యం కాజెయ్యాలని కళింగుడు పథకం వేశాడు.

రాయబారాలూ, యుద్ధ ప్రయత్నాలూ లేకుండా కళింగుడు తన సైన్యంతో సహా యుద్ధానికి వస్తున్నట్టు అజాతశత్రువుకు తెలిసింది. యుద్ధానికి సిద్ధంగా ఉన్న వాళ్ళంతా బయలుదేరమని అజాతశత్రువు చాటింపు వేయించాడు. చాటింపు విని పించిన రెండు ఘడియల లోపల రాజ్యం లోని పురుషు లందరూ తమకు దొరికిన ఆయుధాలు చేతబట్టి, కళింగుడితో యుద్ధా నికి సిద్ధమయారు.

కళింగుడి సేన అజాతశత్రువు రాజ్యం లోకి ప్రవేశించి కొద్దిదూరం వెళ్ళేసరికల్లా అజాతశత్రువు సేనలు అన్ని వైపుల నుంచీ చుట్టుముట్టాయి. అజాతశత్రువు సైని కులు కళింగుడి సేనలను క్షణంలో ధ్వంసం చేశారు. పారిపోయే అవకాశం కూడా లేక, కళింగుడు తన శత్రువులకు దొరికి పోయాడు. సైనికులు అతన్ని పెడరె క్కలు విరిచికట్టి అజాతశత్రువు వద్దకు తీసుకు పోయారు.



అజాతశత్రువు వెంట ఉన్న సర్దారులు తలా ఒక సలహా ఇచ్చారు. కొందరు కళింగుడికి శిరచ్ఛేదం విధించమన్నారు. అలాంటి నీతిమాలినవాణ్ణి కళ్ళు పొడవాలని కొందరన్నారు; చిత్రవధ చెయ్యాలని కొందరన్నారు. కళింగుడు వాళ్ళ ఆగ్రహం చూసి వణికి పోయాడు.

"ఏమీ అవసరంలేదు. అతని కట్లు విప్పి స్వేచ్ఛగా వదిలెయ్యండి," అన్నాడు అజాతశత్రువు.

సర్దార్లకు ఆ పని చెయ్యటం ఏమా త్రమూ ఇష్టం లేకపోయినా, రాజాజ్ఞ కనక కళింగుణ్ణి విడిచిపుచ్చారు.



బేతాళు డీ కథ చెప్పి, "రాజా, అజాత శత్రువు తనకున్న ఒకే ఒక శత్రువైన కళింగుణ్ణి చంపేసి శత్రుశేషం లేకుండా చేసుకోవటానికి మారుగా అతన్ని ఎందుకు విడిచిపుచ్చాడు? అజాతశత్రు వనే తన బిరుదు సార్థకం చేసుకోవటానికా? లేక అలా చెయ్యటంవల్ల కళింగుడు తనకు శాశ్వతంగా మిత్రుడవుతాడనా? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "అజాత శత్రువు కళింగుణ్ణి విడిచిపుచ్చటానికి కారణాలు అవేవీ కావు. కళింగుణ్ణి చంపినందు వల్ల అజాతశత్రువుకు శత్రువులు లేకుండా పోతారన్నది నిజంకాదు. అతని కొడుకులూ, మనమళ్ళూ కూడా అజాతశత్రువుకు శాశ్వతంగా శత్రువులవుతారు. వాళ్ళు కళింగుడి చావుకు పగ తీర్చుకునేటందుకు శాయశక్తులా ప్రయత్నించి తీరుతారు. అది అలా ఉంచి, కళింగుణ్ణి విడిచిపెట్టినందు వల్ల అజాతశత్రువుకు ఏవిధమైన నష్టమూ లేదు. ఏ రాజైనా పొరుగు రాజ్యం మీదికి యుద్ధానికి వెళితే, గెలిచే అవకాశం ఉందన్న అంచనాతోనే వెళతాడు. కళింగుడు మరింత జాగ్రత్తపడి చెప్పకుండా యుద్ధానికి వచ్చాడు. అయినా అతనికి ఘోర పరాజయం సంప్రాప్తమయింది. అతని సేన చాలాభాగం నష్టమయింది. అందుచేత కళింగుడు తన జన్మలో ఇలాటి ప్రయత్నం మరి చెయ్యడు. తన తరవాత వచ్చేవాళ్ళను కూడా అతను వద్దని హెచ్చరించే అవకాశం ఉన్నది. అందుకే అజాత శత్రువు కళింగుణ్ణి విడిచిపుచ్చాడు. అలా చెయ్యటంవల్ల తన పేరు సార్థకమైనదని రుజువు చేసుకున్నాడు కూడా," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# వెర్రివాళ్లు

బొగ్దాదులోని వెర్రాసుపత్రిలో ఇద్దరు వెర్రి వాళ్లు చాలా స్నేహంగా ఉండేవాళ్లు. వారిలో ఒకడు ధనికుడు; వ్యాపారంలో తన కున్న దంతా పోగొట్టుకుని, మతి చెడి వెర్రివాడై పోయాడు. రెండోవాడు బాగా చదువు కున్నవాడు; ఎవతెనో ప్రేమించి, ఆమె చేత నిరాకరించబడి, మతి చెడినవాడు.

ధనికుడు రోజూ అధికారుల దగ్గిరికి వెళ్ళి, "నా పోటీదార్లయిన వర్తకులు నన్ను చూసి ఓర్చలేక, నేను పిచ్చివాణ్ణని వాదు పుట్టించారు. నా కేమీ పిచ్చిలేదు. దయచేసి నన్ను ఇంటికి పంపెయ్యండి," అని వేడుకునేవాడు. కాని అతని ప్రార్థన లను ఎవరూ వినిపించుకునేవారు కారు.

ఒకనాడు ధనికుడు ఎవరూ చూడకుండా ఎత్తయిన మొండిగోడమీద ఎక్కి కూర్చుని, సవారీ చేస్తున్నవాడల్లే, "చల్, చల్!" అని గోడను అదిలించసాగాడు.

ఆ మనిషి అక్కణ్ణించి పడి చచ్చిపోతే ఆస్పత్రికి చెడ్డపేరు వస్తుందని భయపడి, ఆస్పత్రి అధికారి వచ్చి, అతన్ని గోడ దిగి రమ్మని బతిమాలాడు. కాని వెర్రివాడు వినిపించుకోలేదు.

"దిగి వచ్చావంటే నిన్ను వెంటనే ఇంటికి పంపేస్తాను," అని అధికారి మాట ఇచ్చాడు. కాని అందువల్ల కూడా లాభం లేకపోయింది. వెర్రివాడు మరింత హుషా రుగా "చల్, చల్!" అని గోడను అదిలి స్తూనే ఉన్నాడు.

ఇంతలో అతని స్నేహితుడు వచ్చి, అధికారితో, "నన్ను ఇంటికి పోనిచ్చే టట్టయితే నా మిత్రుణ్ణి క్షణంలో గోడ దించుతాను," అన్నాడు.

అందుకు అధికారి ఒప్పుకున్న మీదట, చదువుకున్నవాడు పెద్ద కత్తెర ఒకటి తెచ్చి, గోడ మీది వెర్రివాడితో, "ఇదుగో, నే నీ

గోడను కత్తిరించేస్తున్నాను. నువు కింద పడి పోతావు, జాగ్రత్త!" అన్నాడు.

గోడ మీది వెర్రివాడు తన మిత్రుడి చేతిలో ఉన్న పెద్ద కత్తెరను చూసి, "ఉండు, ఉండు! నన్ను దిగి రానీ, గోడను కత్తిరిద్దువుగాని," అంటూ గోడ దిగాడు.

ఆస్పత్రి అధికారి అతన్ని వెంటనే నిర్బంధంలో పెట్టించి, రెండోవాణ్ణి విడుదల చేసి ఇంటికి పంపేశాడు.

* * *

వెర్రివాళ్ళందరూ అస్పత్రులలోనే ఉంటారని లేదు, బయట కూడా అనేక మంది వెర్రివాళ్ళూ, వెర్రిబాగులవాళ్ళూ ఉంటారు.

ముల్లా నాసరుద్దీన్ అనే వాడు ఒకసారి స్నానశాలకు వెళ్ళి శుభ్రంగా స్నానంచేశాడు. తన లాగే స్నానాలు చేసినవాళ్ళు గచ్చు మీద పడుకుని, గురకలు కొడుతూ నిద్ర పోవటం అతడి కంట పడింది. అతనికి కూడా నిద్ర ముంచుకొస్తున్నది. నిద్రపోతే అంతమందిలో తా నెవరయిందీ గుర్తు తెలీక పోతుందేమో నని, ముల్లా ఒక చిన్న కూజాను తన నడుముకు కట్టుకుని, పడుకుని నిద్రపోయాడు.

కొంచెం సేపయాక నిద్రపోతున్న వాళ్ళలో ఒకడు లేచి, ముల్లా నడుముకు కట్టి ఉన్న కూజా మీద భ్రాంతిపడి, దాన్ని



తీసి తన నడుముకు కట్టుకుని, మళ్ళీ నిద్రపోయాడు.

ముల్లా నిద్రలేచి, తన నడుముకు కూజా లేకపోవటం తెలుసుకుని, అది మరొకడి నడుముకు కట్టి ఉండటం గమనించి, వాణ్ణి లేపి, "అబ్బాయ్, నేను నేనే అయితే నా కూజా ఎక్కడ? ఒకవేళ నువే నేనైతే, మరి నే నెవర్ని?" అని అడిగాడు.

* * *

పర్షియాదేశపు భూస్వామి ఒకడు తన గుర్రం మీద ప్రయాణమై పోతున్నాడు. అతని నౌకరు ఒకడు గుర్రం ముందు పరిగెత్తుతున్నాడు. సాయంకాలానికి వాళ్ళు ఒక ప్రదేశం చేరి, ఆ రాత్రికి అక్కడే ఉండిపోవా లనుకున్నారు.

ఇద్దరి భోజనమూ అయాక యజమాని తన నౌకరుతో, "అబ్బీ, నువు రోజల్లా పరిగెత్తి, పాపం అలిసిపోయావు. అందుచేత అర్ధరాత్రి దాకా నువు పడుకుని నిద్రపో; నేను గుర్రాన్ని కనిపెట్టి ఉంటాను. అర్ధ రాత్రికి నిన్ను లేపి, నేను పడుకుంటాను. తెల్లవారిన దాకా నువు గుర్రాన్ని కనిపెట్టి ఉండు," అన్నాడు.

నౌకరు సరేనని పడుకుని నిద్రపోయాడు. అర్ధరాత్రి దాకా మేలుకుని ఉండి, తరవాత నౌకరును లేవగొట్టి, "ఇక గుర్రాన్ని కని



పెట్టి ఉండటం నీ వంతు," అని యజమాని పడుకుని నిద్రపోయాడు.

తరవాత కొద్దిసేపటికే నౌకరు కూడా హాయిగా నిద్రపోయాడు.

ఒక గంట గడిచాక యజమాని కళ్ళు తెరిచి, నౌకరును కేకేసి, "ఏం చేస్తున్నావురా?" అని అడిగాడు.

"ఆలోచిస్తున్నాను," అన్నాడు నౌకరు.

"ఏమాలోచిస్తున్నావు?" అన్నాడు యజమాని.

"రక్కసిముళ్ళకు ఎవరు పదును పెడుతున్నారా అని ఆలోచిస్తున్నాను," అన్నాడు నౌకరు.

"భేష్! నువు బుద్ధిగలవాడివి," అని యజమాని మళ్ళీ నిద్రపోయాడు.

ఇంకొక గంట గడిచాక అతనికి మళ్ళీ మెలకువ వచ్చింది; నౌకరును పిలిచి, "ఏం చేస్తున్నావురా?" అని అడిగాడు. "ఆలోచిస్తున్నాను," అన్నాడు నౌకరు.

"ఏమాలోచిస్తున్నావు?" అని యజమాని అడిగాడు.

"భూమిలోకి పలుగు దిగేస్తే గుంట పడుతుంది గదా, అక్కడ ఉండిన మన్ను ఏమైనట్టూ?" అన్నాడు నౌకరు.

"భేష్, నువు బుర్రగలవాడివి," అని యజమాని మళ్ళీ నిద్రపోయాడు.

ఇంకో గంట గడిచాక మళ్ళీ యజమానికి మెలకువ వచ్చింది. అతను నౌకరును పిలిచి, "ఏం చేస్తున్నావురా?" అని అడిగాడు.

"ఆలోచిస్తున్నాను," అన్నాడు నౌకరు.

"ఏమాలోచిస్తున్నావు?" అన్నాడు యజమాని.

"నిన్న తమరు గుర్రం మీద సవారీ అయారు, నేను గుర్రం ముందు దౌడు తీశాను. ఇప్పుడు మరి గుర్రం లేదు గదా, జీను ఎవరు మోసేట్టూ అని ఆలోచిస్తున్నాను," అన్నాడు నౌకరు.





# కొత్తజీవితం

ఒక ఊళ్ళో చంద్రకాంతు డనే సాలెవా డుండేవాడు. అతను విలువగల బట్టలు నెయ్యటంలో నిపుణుడు. అందుచేత బాగా సంపాదించుకున్నాడు. డబ్బు బాగా చేరింది గనక చంద్రకాంతుడి దగ్గిరికి బంధువులూ, అభిమానులూ కూడా చేరారు. అందరూ అతన్ని తెగ పొగడేవాళ్ళు. వచ్చినవాళ్ళకు అతను కూడా ఏ లోటూ లేకుండా జరిపే వాడు. అడిగిన వాడికల్లా సహాయం చేసే వాడు. ఈ ఔదార్యం మూలంగా అతని కున్నదంతా క్రమంగా హరించుకుపోయి, గడ్డురోజులు దాపరించాయి. మగ్గాలు మరమ్మతు చేయించుకుందామన్నా డబ్బులేదు. చివరకు ఒక పూట తింటే, ఇంకో పూట ఇంటిల్లిపాదీ గంజి తాగవలిసిన పరిస్థితి ఏర్పడింది.

మగ్గాలు బాగుచేసుకుని మళ్ళీ నేతపని మీద దృష్టి ఉంచుదామని చంద్రకాంతుడు తన బంధువులను ఒక వెయ్యి రూపాయలు అప్పివ్వమని అడిగాడు. ఒక్కరూ అతనికి సహాయం చెయ్యలేదు. అందరూ తలా ఒక సాకూ చెప్పి, తమ దగ్గిర డబ్బు లేదన్నారు. కొందరు మరింత కఠినంగా, "ఉన్నప్పుడు ఒళ్ళుపై తెలియకుండా ఖర్చుచేస్తే ఇదే గతి పడుతుంది!" అని బుద్ధి చెప్పారు కూడా. వీళ్ళంతా ఒకప్పుడు అతని సహాయం పొందిన వాళ్ళే, అతన్ని తెగ పొగడినవాళ్ళే.

ఆలస్యంగానైనా చంద్రకాంతుడు గుణపాఠం నేర్చుకున్నాడు. ఇక మగ్గంపని చేసే అవకాశం లేదు గనక, కూలిపనిచేసి అయినా కుటుంబాన్ని పోషించుకుందా మనుకుని, ఆ పనిలోకి దిగాడు.

ఇంతలో ఊరికి చెరువు తవ్వించాలని నిర్ణయం జరిగింది. ఆ పని చూడటానికి ఒక పెద్దమనిషి ఏర్పాటయ్యాడు. చెరువు తవ్వే చోటికి ఎక్కడెక్కడినుంచో కూలీలు

పి. అనసూయ



వచ్చారు. పలుగొకటి పట్టుకుని చంద్ర కాంతుడు కూడా వచ్చాడు.

చెరువు తవ్విస్తున్న పెద్దమనిషి, కూలీల చేత చురుకుగా పని చేయించాలని కాబోలు, పని ప్రారంభించే ముందు కూలీలతో ఇలా అన్నాడు: "చెరువు తవ్వే ప్రదేశంలో నిధి నిక్షేపాలు ఉండవచ్చు. ఏ లంకెబిందెలన్నా ఉండేపక్షంలో అవి ఏ కూలివాడి పలుగుకు తగిలితే వాడి సొత్తే! దానిమీద మరెవరికీ అధికారం ఉండదు. అందుచేత ఎవరి అదృష్టం ఎలా ఉందో మరి!"

ఈ మాటలు కూలీలకు మంచి ఉత్సాహాన్నిచ్చాయి. మొదటి రోజు తవ్వకం పని చాలా చురుకుగా సాగింది. పని చేస్తున్నంతసేపూ చంద్రకాంతుని మనసులో ఏదో ఆలోచన మెదులుతూ వచ్చింది. అతను ఆ రాత్రి ఇంటికివచ్చి, ఆ ఆలోచనను కార్యరూపంలో పెట్టటానికి ఉపక్రమించాడు.

అతను ఒక పాతబిందె తీసుకుని, దాని నిండా చిళ్ళపెంకులు నింపి, దాని మూతికి ఒక రేకు అతికించి, అర్ధరాత్రివేళ చెరువు తవ్వే చోటికి వెళ్ళి, తాను మర్నాడు తవ్వబోయే మట్టికింద దూర్చి, మట్టి కప్పి, ఇంటికి వచ్చేశాడు.

మర్నాడు ఉదయం మళ్ళీ కూలీలు వచ్చారు. చంద్రకాంతుడు కొద్దిసేపు తవ్వగానే, అతని పలుగుకు బిందె తగిలి, ఖంగుమన్న మోతవినిపించింది. అతని పక్కన పనిచేసేవాళ్ళు, "లంకెబిందెలో!" అని అరిచారు. అందరూ పరిగెత్తుకుంటూ వచ్చారు. చంద్రకాంతుడు, పైపైన ఉన్న మట్టి తవ్వి, పెద్ద బిందెను పైకి తీశాడు.

"అదృష్టమంటే నీదే! బిందె తెరూ, లోపల ఏముందో చూద్దాం!" అన్నారు కూలీలు. చెరువు తవ్వించే ఆయన కూడా అక్కడికి వచ్చి బిందెలో ఏముందో చూడాలని ఆత్రపడ్డాడు.

"నిధికి పూజ జరగాలి. మంచి ముహూర్తం చూసి, మంత్రోక్తంగా తెరవాలి. అవసరమైతే శాంతి చెయ్యాలి. సంతర్పణ చెయ్యాలి. ఇష్టంవచ్చినట్టు తెరవరాదు!" అన్నాడు చంద్రకాంతుడు.

"నీ పంట పండిందిలే! ఇంక కూలి ఏం చేస్తావు? బిందె తీసుకుని ఇంటికి వెళ్ళు," అన్నాడు పెద్దమనిషి.

చంద్రకాంతుడు బిందె నెత్తిన పెట్టుకుని, పలుగు చేత పట్టుకుని ఇంటికి వచ్చేశాడు.

కాని మర్నాడు అతను మళ్ళీ పలుగుతో కూలిపనికి హాజరయే సరికి చెరువు తవ్వించే పెద్దమనిషి, "నీ దరిద్రం తీరిపోయిందిగా? మళ్ళీ కూలిలోకి వచ్చావేమిటి?" అని అడిగాడు. మిగతా కూలీలకూ అదే అనుమానం కలిగింది.

"ఏం చెప్పను, బాబూ? శాస్త్రుల్లుగారిని విచారిస్తే ఆయన నా జాతకం చూసి, బిందె దొరికిన ముహూర్తం చూసి, ఇంకా మూడేళ్ళదాకా దాన్ని తెరవటానికి వీల్లేదన్నాడు. అప్పుడైనా ఎన్నో గ్రహాలకు శాంతి చెయ్యాలిట. అన్నదానం చెయ్యాలిట, అంతదాకా నాకు పొట్టగడవాలిగా?" అన్నాడు చంద్రకాంతుడు.



అందరికీ అతని పట్ల సానుభూతి కలిగింది. అతను తమలాగే పలుగుపట్టి పని చేస్తున్నప్పటికీ, మిగతా కూలీలు అతన్ని గౌరవంగా చూశారు. ఏమైనా అతను శ్రీమంతుడు కాబోయేవాడే గద!

చంద్రకాంతుడికి నిధి దొరికిందన్న వార్త అతని బంధువులందరికీ, చాటింపు వేసినట్టుగా తెలిసిపోయింది. అతన్ని మళ్ళీ ఇచ్చకపు మాటలతో ఉబ్బేసి, మంచి చేసుకుందామని ఒకరొకరే వచ్చారు.

"అదృష్టవంతుణ్ణి దేవుడు కూడా చెరపలేడు! నీకు నిధి దొరికిందంటే మేమెంతో సంతోషించాం. నువు జానెడు

పొట్ట కోసం కూలిపని చేసుకుంటున్నావని విని మా కెంత బాధ కలిగిందో ఆ పర మాత్ముడికే తెలుసు!" అన్నారు బంధు వులు విచారం నటిస్తూ.

"నా అదృష్టం అడుక్కు తిన్నట్టే వుంది! ఆ నిధిని నేను మూడేళ్ళు తాకరా దంటున్నారు. నా మగ్గాలు సరిగా ఉంటే కూలిపని చేసుకునే కర్మ నా కేమిటీ? ఒక్క వెయ్యి రూపాయలు అప్పుపెట్ట మంటే ఎవరూ పెట్టారు కారు. కూలి చేసు కోక ఏం చేసేదీ?" అన్నాడు చంద్ర కాంతుడు.

"ఎప్పుడో లేదన్నామంటే ఎప్పుడూ లేకుండానే పోతుందా? నీ కెంత కావాలో చెప్పు!" అన్నారు బంధువులు.

"ఒక వెయ్యి ఉంటే చాలు," అన్నాడు చంద్రకాంతుడు.

అతను వద్దంటున్నా నలుగురు బంధు వులు ప్రోద్బలంచేసి, అతనికి నాలుగు అయిదేసి వందలు, రెండువేల రూపా యలు, పెట్టుబడికి అప్పిచ్చారు.

ఆ డబ్బుతో అతను కొత్త మగ్గాలు కొని, పెద్ద ఎత్తున నేతపని మొదలెట్టాడు. మళ్ళీ డబ్బు కూడ సాగిరిది. రెండో సంవత్సరం పూర్తి అవుతూనే అతను తన బంధువుల బాకీ తీర్చేశాడు.

మూడో సంవత్సరం కూడా ముగిసింది. బిందె తెరవటానికి ముహూర్తం ఏర్పా టయింది. బంధువులంతా వచ్చిపడ్డారు. బ్రాహ్మడు వచ్చి మంత్రాలు చదివాడు. చంద్రకాంతుడు బిందెకున్న మూత సీలు పగలగొట్టాడు. బిందె నిండా చిళ్ళపెంకులు!

విందుభోజనాలు చేస్తూ వారాలతరబడి ఉందామనుకున్న బంధువులు మామూలు భోజనాలతో తృప్తిపడి వెళ్ళిపోయారు.

చంద్రకాంతుడి ఎత్తు పారింది. ఈసారి అతను చాలా జాగ్రత్తపడి తన కష్టార్జితం తోనే తిరిగి సంపన్నుడయాడు.





# నీటివిలువ

విజయేంద్రు డనే చిన్న రాజు సిరిపురం అనే నగరాన్ని ఏలుతూ ఉండేవాడు. సిరిపురం చుట్టూ కొండలూ, దట్టమైన అరణ్యాలూ ఉండేవి. ఆ ప్రాంతాలలో కోయ వాళ్ళు నివసించే వాళ్ళు.

కోయనాయకుడు విజయేంద్రుడికి ఏటా ఏదో ఒక కానుక పంపుతూ ఉండేవాడు. అది విలువైనది కాకపోయినా, కోయల రాజ భక్తికి చిహ్నంగా ఉంటూ ఉండేది.

అలవాటు ప్రకారం ఒక ఏడు కోయ నాయకుడి వద్ద నుంచి సుమంగ్ అనే కోయ వాడు రాజుకు ఒక కానుక తెచ్చాడు. రాజు గారు వాణ్ణి సభలో ప్రవేశించ నిచ్చి, ఆదరించాడు. సుమంగ్ ఒక వెదురు బుట్ట నుంచి ఒక వెదురులోటా, మూత ఉన్నది, తీసి రాజుగారికి భక్తిగా ఇచ్చాడు.

ఆ వెదురు లోటాలో ఏ మున్నదోనని సభికులు ఆత్రంగా చూస్తున్నారు. రాజు వెదురు లోటాను అందుకుని, మూత తీసి, దానిలోకి చూసి, విరగబడి నవ్వుతూ, లోటాను తలకిందులు చేశాడు. అందులో నుంచి నీరు దొణదొణా కింద కారింది.

ఆయన సుమంగ్ కేసి చూసి, "మీ నాయకుడికి రానురాను మతి పోతున్నట్టు న్నది! లేకపోతే ఈ అవమాన మేమిటి? నీళ్ళు కానుకగా పంపుతాడా? కానుకలు పంపమని నేనేమైనా అడిగానా? వాటికోసం ఆత్రంగా ఎదురు చూస్తున్నానా? ఇలాటి అర్థంలేని కానుకలు పంప వద్దన్నానని మీ నాయకుడితో చెప్పు," అన్నాడు.

సుమంగ్ వినయంగా చేతులు మోడ్చి, "మన్నించండి, మహారాజా! మా నాయ కుడు పంపినది మామూలు నీరు కాదు. మాకు ఇటీవల శివలింగం మీద పడుతున్న నీటిధార ఒకటి కనబడింది. ఆ నీరు మంచి సువాసన గలిగి, అమృతంలాగున్నది.

"త్రివిక్రమ్"



అందుచేత మా దొర దాన్ని తమకు పంపాడు. మీరు నీరే గదా అని కింద పారబోశారు గాని, అదే ఒక్కొక్కప్పుడు రాజ్యం ఖరీదు చెయ్యవచ్చు," అన్నాడు.

రాజు, సుమంగ్ చెప్పిన మొదటి మాటలకు తృప్తి పడ్డాడుగాని, వాడు చివర అన్న మాటకు ఆగ్రహం తెచ్చుకుని, "ఆ లోటాడు నీళ్ళతో నువు రాజ్యం సంపాదించు, నీకు నా కూతుర్ని ఇచ్చి పెళ్ళిచేస్తాను. లేకపోతే ఎప్పుడో నీ తలతీసేస్తాను," అన్నాడు.

సుమంగ్ తలవంచి నమస్కరించి, తిరిగి వెళ్ళిపోయి, కోయనాయకుడికి జరిగినదంతా చెప్పాడు.

తన అనుచరుడి మాట నిజం చేసేభారం కోయనాయకుడి పైన పడింది. కొద్ది రోజులు పోనిచ్చి, అతను రాజుగారి వద్దకు ఒక మనిషిని పంపాడు. ఆ మనిషి వచ్చి రాజుతో, "మహారాజా, అరణ్యంలో మహాదేవగిరి లోయప్రాంతాల అడవి పందులు అనేకంగా ఉన్నాయి. వాటిని తమరు వేటాడ వలసిందిగా మా దొర మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాడు," అని చెప్పాడు.

విజయేంద్రుడు ఉత్సాహంగా బయలుదేరి కోయపల్లెకు వచ్చాడు. కోయనాయకుడాయనకు గొప్ప విందు ఏర్పాటు చేశాడు. విందులో అన్నీ మధురపదార్థాలే.

తరవాత విజయేంద్రుడు గుర్రం ఎక్కి, కోయనాయకుణ్ణీ, మరి ముగ్గురు అంగరక్షకులనూ, ఇతర వేటగాళ్ళనూ వెంటబెట్టుకుని మహాదేవగిరి లోయకు బయలుదేరాడు.

లోయకు సరి అయిన దారిలేదు. చెట్ల మధ్యగా తీగెలూ, తుప్పలూ నరుక్కుంటూ వెళ్ళవలసి వచ్చింది. వాళ్ళు లోయ చేరే సరికే చాలా పొద్దెక్కింది. అక్కడ అడవి పందులు చాలా ఉన్నాయి. రాజు వాటిని వేటాడటంలో నిమగ్నుడయ్యాడు.

అన్నిటికన్న చాలా భారీగానూ, బలిష్ఠంగానూ ఉన్న కోరల పంది ఒకటి రాజు

దృష్టిని ఆకర్షించింది. రాజు దాన్ని పదునైన బాణంతో కొట్టాడు. కాని అది చావక పారిపోసాగింది. రాజు వెంటబడ్డాడు.

రాజు కనుమరుగు కాగానే కోయనాయకుడు మోర ఎత్తి, నోటికి చెయ్యిపెట్టి, సంకేతంగా ఒక ధ్వని చేశాడు. వెంటనే దానికి జవాబు వచ్చింది. మరికొద్ది క్షణాలకు సుమంగ్ అక్కడికి వచ్చాడు. కోయనాయకుడు వాడికి రాజు వెళ్ళిన దిక్కు చూపించాడు. సుమంగ్ వేగంగా అటుకేసి పడిచాడు.

వాడు తనను చేరే లోపుగా రాజు పందిని కొట్టాడు, కాని తీవ్రమైన దాహంతో బాధపడసాగాడు. కోయనాయకుడు తన చేత తినిపించిన మధురపదార్థాలే తన దాహానికి కారణమని రాజు ఊహించలేదు. ఆయన శరీరం దాహబాధతో వివశమైపోతున్నది. "దాహం! దాహం!" అంటున్నాడుగాని మాట సరిగా రావటం లేదు. ఆయన ఒక బండరాయి మీద చతికిలబడి, తన ప్రాణాలు పోతున్నట్టే బాధపడసాగాడు.

ఇంతలో సుమంగ్ ఆయనకు సమీపంగా, ఆయనను చూడనట్టుగా, నడుచుకుంటూ వెళ్ళాడు. ఆ స్థితిలో రాజు సుమంగ్‌ను గుర్తు పట్టలేదు. "దాహం! నీరు!" అన్నాడాయన సుమంగ్‌తో.



"నా దగ్గిర లోటాడు నీరే ఉన్నది. అవి కాస్తా ఇస్తే నాగతేమిటి?" అన్నాడు సుమంగ్.

"చచ్చిపోతున్నాను! నీరియ్యి! ఏమడిగితే అది ఇస్తాను," అన్నాడు రాజు తన గొంతు పట్టుకుని.

సుమంగ్ వెదురు బుట్టలో నుంచి ఒక వెదురు లోటా తీసి, దాని మూత తీసి, లోటా రాజుకు అందించాడు. రాజు ఆ లోటాలోని నీటిని ఒక్క చుక్క మిగలకుండా తాగేశాడు. పోతున్న ప్రాణం లేచి వచ్చినట్టయింది. తన చేతిలో ఉన్న లోటా కేసి చూశాడు. అటువంటి లోటాను తాను ముందొకసారి చూసినట్టు తోచింది. కళ్ళెత్తి సుమంగును చూశాడు. అతనూ అదివరకు చూసిన మనిషే!

"బతికించావు! నా కింత గొప్ప ఉపకారం చేసినందుకు ఏం కోరుకుంటావో కోరుకో!" అన్నాడు రాజు.

"మరేమీ అక్కర్లేదు, తమ రాజ్యం ఇప్పించండి," అన్నాడు సుమంగ్ నవ్వుతూ.

వెంటనే రాజు వాణ్ణి గుర్తించి, "నువా!" అన్నాడు. సుమంగ్‌ను కౌగలించుకుని, "మొత్తానికి అన్న మాట నిలబెట్టుకున్నావు! రాజ్యం ఇవ్వమంటావా? నా కూతురినిచ్చి పెళ్ళి చెయ్యమంటావా? రెండూ కావాలంటావా?" అన్నాడు.

"మా కవన్నీ ఎందుకు, మహారాజా? మీ అభిమానమే మాకు పదివేలు! మీ రాజ్యం మీరే ఏలండి! మీరు బాగా ఏలుతారనే గదా మాకందరికీ మీరంటే అభిమానం? మీ అమ్మాయిగారిని ఏ రాజకుమారుడికో ఇచ్చి పెళ్ళి చేసి, మాకందరికీ బహుమానా లివ్వండి," అన్నాడు సుమంగ్.

రాజు చాలా సంతోషించాడు. ఆయన కోయనాయకుణ్ణీ, సుమంగ్‌నూ తన వెంట నగరానికి తీసుకుపోయి, వాళ్ళకు మంచి కానుకలిచ్చి పంపేశాడు.





# అనేక హంతకులు!

చాలాకాలం క్రితం చీనా దేశంలో ఒక ధనికుడైన దర్జీవాడు ఉండేవాడు. అతను వినోదప్రియుడు. అప్పుడప్పుడూ అతను తన భార్యను వెంటబెట్టుకుని నగరంలోని వినోదాలు చూస్తూ రోజల్లా తిరిగేవాడు.

ఒకనాడు అలాగే దర్జీ తన భార్యతో సహా నగరమంతా చుట్టబెట్టి, సాయంకాల మయాక ఇంటికి తిరిగి వస్తూండగా వాళ్ళ కొక మరుగుజ్జువాడు కనిపించాడు. ఆ మరుగుజ్జు రకరకాల హాస్యాలు చేసి, తన చుట్టూ ఉన్నవాళ్ళను కడుపుబ్బ నవ్విస్తున్నాడు. అందరితోబాటు దర్జీ, అతని భార్యా కూడా మరుగుజ్జువాడి హాస్యాలకు విరగబడి నవ్వి, ఆ రాత్రికి వాణ్ణి తమ అతిథిగా ఆహ్వానించారు. మరుగుజ్జు సరే నన్నాడు.

మరుగుజ్జువాణ్ణి ఇంటికి తెచ్చి, దర్జీవాడు దుకాణానికి వెళ్ళి, వేయించిన చేపలూ, రొట్టెలూ, నిమ్మకాయలూ, తెల్లనువ్వుల హల్వా కొనితెచ్చాడు. తరవాత ముగ్గురూ, భోజనానికి ఉపక్రమించారు.

భోజనం ఉల్లాసంగా జరిగి పోతూండగా దర్జీవాడి భార్య ఒక పెద్ద చేపముక్కను తీసుకుని మరుగుజ్జువాడి నోట కుక్కి, వాడి నోరు గట్టిగా మూసి, "అంతా ఒక్కసారే మింగాలి," అన్నది. అతి కష్టంమీద మరుగుజ్జువాడు దాన్ని మింగటానికి యత్నించాడు. దురదృష్టవశాన ఆ చేపముక్కలో పెద్ద ముల్లుండి, అది మరుగుజ్జువాడి గొంతులో గుచ్చుకున్నది. మరుగుజ్జు గుడ్లు తేలవేసి, ప్రాణాలు వదిలాడు.

అది చూసి దర్జీవాడు, "అరే అల్లా! పాపం, వీడి ప్రాణాలు మన చేతిమీదుగా పోయాయే! ఎలాటి దురదృష్టం వచ్చి పడింది!" అని వాపోసాగాడు.

"ఏడిచి ఏం లాభం? చేయవలిసింది ఆలోచించాలి గాని," అన్నది దర్జీ భార్య.

అరేబియన్‌నైట్స్ కథ



"ఏం చేద్దామంటావు?" అని దర్జీవాడు అడిగాడు.

"వీడిపైన బట్టకప్పి భుజాని కెత్తుకో. ఇద్దరమూ మన బిడ్డకు రోగం వచ్చినట్టు నటిస్తూ, వైద్యుడి కోసం బయలుదేరుదాం," అన్నది భార్య.

ఆమె చెప్పినదంతా వివరంగా విని దర్జీ వాడు మరుగుజ్జు శరీరం మీద ఒక గుడ్డ కప్పి ఎత్తుకుని వీధిలోకి వచ్చాడు. అతని భార్య ముందు నడుస్తూ, "అయ్యో, నా బిడ్డకు మాయదారి మశూచికం వచ్చిందే! ఎవరు రక్షిస్తారు? ఏ వైద్యుడన్నా దొరికితే బాగుణ్ణు!" అని గట్టిగా ఆక్రోశించ సాగింది.

మశూచిక మనే మాట వినగానే వీధిలో వాళ్ళు దర్జీవాడికి దూరంగా తొలిగారు. దర్జీ భార్య వాళ్ళను, "వైద్యుడిల్లెక్కడ, బాబూ? వైద్యు డింటికి దారి ఏది, నాయనా?" అంటూ అడిగింది. చివరకు ఎవరో వాళ్ళ కొక వైద్యుడి ఇల్లు చూపారు.

దర్జీవాడు వైద్యు డింటి తలవాకిలి తలుపు తట్టితే ఒక నీగ్రో బానిస వచ్చి తలుపు తెరిచింది. దర్జీవాడి భార్య ఆమెతో, "మా బిడ్డకు చాలా సుస్తీగా ఉన్నది. వైద్యుడిగార్ని త్వరగా వచ్చి చూడమని చెబుతావా?" అంటూ ఆ బానిస చేతిలో ఒక వెండికాసు పెట్టింది.

ఈ మాట చెప్పటానికి నీగ్రో బానిస మేడ మీదికి వెళ్ళగానే, భార్యా భర్తలిద్దరూ లోపలికి అడుగుపెట్టి, మరుగుజ్జు వాడి శవాన్ని మెట్లమీద పెట్టేసి, కాలిసత్తువకొద్దీ పారిపోయారు.

ఈ లోపుగా నీగ్రో బానిస మేడ మీద వైద్యుడి చేతిలో వెండికాసు పెట్టి, ఎవరో వైద్యానికి వచ్చారని చెప్పింది. వైద్యుడు ఆ కాసు చూసిన ఆనందంలో దీపం తీసుకోవాలన్న సంగతి కూడా మరిచిపోయి, గబగబా మెట్లు దిగి వస్తూ, చీకట్లో మరుగుజ్జువాడి. శరీరాన్ని తన్నాడు. ఆ శరీరం

మెట్ల మీది నుంచి దొర్లి కింద పడిపోయింది. వైద్యుడు కిందికి వచ్చి చూస్తే శవం!

ఇది తాను చేసిన హత్యే అనుకుని వైద్యుడు కంగారు పడిపోయి, శవాన్ని ఏం చెయ్యాలా అని ఆలోచించాడు. ఆయన దాన్ని తన భార్య వద్దకు తీసుకుపోయి, జరిగినది చెప్పాడు.

"ఇది ఈ ఇంట్లో ఉండటానికి వీల్లేదు. ఈ రాత్రే దీన్ని వదిలించుకోవాలి. రేపు పొద్దుటి దాకా ఇక్కడే వున్నదంటే కొంప మునిగిందన్న మాటే! దీన్ని డాబా మీదికి తీసుకుపోయి మన పొరుగున ఉన్నవాళ్ల దొడ్లో పడేద్దాం. ఆ ఇంటివాడు సుల్తానుగారి పాకశాలాధికారి. వాళ్ళ ఇంటి నిండా అంతులేని పిల్లులూ, కుక్కలూ, ఎలకలూనూ. అవి ఈ శవాన్ని క్షణాలమీద తిని పారేస్తాయి. పీడ విరగడ అవుతుంది," అన్నది వైద్యుడి భార్య.

సరే, భార్యాభర్త లిద్దరూ డాబా మీదికి వెళ్లి, పక్క ఇంటివాడి వంటగది గోడకు చేరబడేలాగా మరుగుజ్జువాడి శరీరాన్ని జాగ్రత్తగా దించి, తమకు పట్టిన పీడ వదిలించుకున్నారు.

మరుక్షణమే పక్క ఇంటివాడు ఎక్కడి నుంచో ఇంటికి తిరిగి వచ్చి, మైనం వత్తి వెలిగించి, దాని వెలుగులో, తన వంట





ఇంటి గోడ నానుకుని ఎవరో కదలకుండా నిలబడి ఉండటం కనిపెట్టాడు.

అతని ఇంట తిండిపదార్థాలు తరుచు మాయమవుతూండేవి. ఆ దొంగతనం చేస్తున్నది ఏ పిల్లులో, కుక్కలో అని అతను అనుకుంటూ వచ్చాడు. ఇప్పు డతను, "ఓహో! ఈ ఇంటిదొంగ మనిషేనా? పక్కింటి డాబా మీదుగా దిగాడన్నమాట," అనుకుని, ఒక దుడ్డుకర్ర తెచ్చి, ఒక్క దెబ్బతో మరుగుజ్జును పడగొట్టి, అంతతో కసి తీరక, అదేపనిగా శవాన్ని బాదాడు.

ఎన్ని కొట్టినా "దొంగ" ఉలకడు, పలకడు! ఆ మనిషి వంగి చూస్తే, శవం!



"నా కొంప ముంచావురా మరుగుజ్జువాడా! నా ఇంట దొంగతనం చేసి నష్టం కలిగించింది చాలక, చచ్చి నా ప్రాణం మీదికే తెచ్చావా? అల్లా, నువే నన్ను కాపాడాలి!" అని ఆ మనిషి ఆక్రోశించాడు.

అతను ఆ శవాన్ని మోసుకుని మార్కెటు అవతలి చివరకు తీసుకుపోయి, ఒక దుకాణం మొగదల శవాన్ని నిలబెట్టి తన దారిన తాను వెళ్ళాడు. అప్పటికి రాత్రి చాలా భాగం గడిచింది.

కొంతసేపటికి ఒక వడ్డీ వ్యాపారస్థుడు తప్పతాగి, మైకం పోవటానికి స్నానశాలకు తూలుతూ పోతూ అటుగా వచ్చాడు. మరుగుజ్జువాణ్ణి చూడగానే ఆ వ్యాపారస్థుడికి, ఆ నిలబడి ఉన్నవాడు దొంగ అని అనుమానం కలిగింది. "దొంగ పట్టుకోండి!" అని కేకలు వేస్తూ అతను మరుగుజ్జువాడి మీదికి లంఘించి, శవాన్ని పడదోసి, చేతులతో బాదసాగాడు.

తాగుబోతువాడి కేకలు విని మార్కెటు కాపలావాళ్ళు పరిగెత్తుకుంటూ వచ్చి, కింద పడినవాణ్ణీ కొడుతున్నవాణ్ణీ చూశారు. కింద పడి ఉన్న మనిషిలో ప్రాణం లేదు.

"నువు హత్య చేశావు! వలీ దగ్గిరికి పద," అని కాపలావాళ్ళు మరుగుజ్జువాడి



శవాన్నీ, వ్యాపారస్థుణ్ణీ పట్టుకుని కొత్వాలు దగ్గిరికి తీసుకుపోయారు.

జరిగిన సంగతి విని కొత్వాలు వ్యాపారస్థుణ్ణి తెల్లవారగానే ఉరి తీయవలసిందిగా తన భటులకు ఉత్తరు విచ్చాడు.

తెల్లవారగానే వ్యాపారస్థుడి ఉరిశిక్ష గురించి నగరమంతటా చాటింపు జరిగింది. జనం ఉరి తీసే చోటికి గుంపులు గుంపులుగా చేరారు. వ్యాపారస్థుణ్ణి వధ్యస్థానంలో నిలబెట్టి, భటులు మెడకు ఉచ్చు కూడా తగిలించారు.

అంతలో సుల్తానుగారి పాకశాలాధికారి పరిగెతుకుంటూ వచ్చి, "ఆగండి, ఆగండి! ఆ మరుగుజ్జును హత్య చేసినవాణ్ణి నేను!" అన్నాడు.

"నువ్వు హత్య ఎందుకు చేశావు?" అని కొత్వాలు అడిగాడు.

పాకశాలాధికారి జరిగినది చెప్పాడు.

"ఈ మనిషి నేరం ఒప్పుకుంటున్నాడు గనక ఆ వ్యాపారస్థుణ్ణి వదిలేసి, ఇతన్ని ఉరి తీయండి," అని కొత్వాలు భటులను ఆజ్ఞాపించాడు.

అంతలో వైద్యుడు వచ్చి, "అసలు హంతకుణ్ణి నేను," అని తన కథ కొత్వాలుకు చెప్పాడు. కొత్వాలు వైద్యుణ్ణి ఉరితీయమన్నాడు.



భటులు వైద్యుణ్ణి ఉరి తీసేలోపల దర్జీవాడు వచ్చి తానే అసలు హంతకుణ్ణని తెలిపి, తన కథ అంతా చెప్పాడు.

"ఈసారి అసలు హంతకుడే దొరికాడు. ఇతన్ని ఉరి తీయండి." అన్నాడు కొత్వాలు.

కాని ఈసారి కూడా ఒక అవాంతరం వచ్చింది.

ఈ చచ్చిపోయిన మరుగుజ్జు వాడు సుల్తానుగారి విదూషకుడు. కిందటి రోజు మరుగుజ్జువాడు ఎటో వెళ్ళి మళ్ళీ తిరిగి రాలేదు. అందుచేత సుల్తాను ఇవాళ తెల్లవారుతూనే అతన్ని గురించి అడిగాడు. మరుగుజ్జువాడు హతుడయాడనీ, అతన్ని చంపినది నేనేనంటే నేనేనని నలుగురు మనుషులు తగాదా పడుతున్నారనీ సుల్తానుకు తెలియవచ్చింది. చచ్చిన మరుగుజ్జునూ, ఆ నలుగురు హంతకులనూ తన వద్ద హాజరుపరచమని సుల్తాను కొత్వాలుకు కబురు పంపాడు.

అందరూ సుల్తాను సమక్షానికి చేరారు. హంతకుల మని చెప్పుకునే నలుగురూ తమతమ కథలు సుల్తానుగారికి నివేదించుకున్నారు. అందరి కథలూ వింటున్న మంగలివైద్యుడొకడు మరుగుజ్జు శవాన్ని పరీక్షించి, "విదూషకుడి ఒంట్లో ఇంకా ప్రాణం ఉన్నది," అన్నాడు.

అతను విదూషకుడి నోరు బలవంతాన తెరిచి, గొంతులోకి చిమ్టా ఒకటి ప్రవేశపెట్టి, గొంతులో ఇరుక్కుని ఉన్న చేప ముక్కను బయటికి లాగాడు. వెంటనే మరుగుజ్జువాడు పెద్దగా తుమ్మి, లేచి కూర్చుని, ముఖం నిముడుకుని, చివాలున లేచి నిలబడ్డాడు.

ఆ విధంగా అందరి కష్టాలూ గట్టెక్కాయి. సుల్తాను మంగలివైద్యుడికి గొప్ప బహుమానం ఇచ్చాడు. సుల్తాను వద్ద బహుమానాలు పొంది, "హంతకు" లందరూ తమతమ ఇళ్ళకు తిరిగిపోయారు.





# దొంగల్లో దొంగ

భోజపురాన్ని ఒకప్పుడు పరిపాలించిన రణధీరసింహుడు గొప్ప ప్రభువు. ఆయన రాజ్యం అష్ట ఐశ్వర్యాలతో తులతూగింది. పరిపాలన సమర్థవంతంగా సాగింది. రాజధానికి నాలుగు పక్కలా కోశాగారాలుండేవి. వాటిలో తీయకుండా ప్రజలకు కావలిసిన సంబారాలన్నీ ఉండేవి.

అలాటి భోజపురానికి దొంగల బాధ సంప్రాప్తమయింది. సాయుధులైన దొంగలు పరిసర గ్రామాల మీద పడి యథేచ్ఛగా దోపిడీలు సాగించారు. వాళ్ళు ఎప్పుడే గ్రామం మీద పడేదీ ముందుగా తెలియదు గనక రాజు తన భటులను వారి పైకి పంపటం సాధ్యంకాలేదు.

భోజపురానికి తూర్పుగా పెద్ద అరణ్యాలున్నాయి. వాటి కింకా తూర్పుగా కొండలున్నాయి. బందిపోటు దొంగలు ఆ కొండలలోని గుహలలో ఉంటారనీ, అరణ్యం కుండా వచ్చి గ్రామాలపైన పడతారనీ చూచాయగా తెలియవచ్చింది.

బందిపోటు దొంగలను పట్టి ఇచ్చిన వారికి మంచి జాగీర్లిస్తానని రాజు ప్రకటించాడు. కొందరు సాహసికులు దొంగలుండే స్థలాలు తెలుసుకుందామని అరణ్యాలలోకి వెళ్లారు. వారెవరూ ప్రాణాలతో తిరిగి రాలేదు. వారిని క్రూరమృగాలు చంపాయో, దొంగలే చంపారో తెలియరాలేదు.

ఒకరోజు రాత్రి దొంగలముఠా అరణ్యం కుండా గ్రామాల కేసి వస్తుండగా చెట్లు పలచగా ఉన్న ప్రాంతంలో వారి కొక వింత దృశ్యం కనబడింది. ఒక యువతి అనేక మంది రాజభటులతో ఒంటరిగా పోరుతూ, ఆత్మరక్షణ చేసుకుంటున్నది. దొంగలను చూడగానే భటులు పారిపోయారు.

దొంగ లామెను సమీపించి, "ఎవరమ్మాయీ నువు? ఆ భటులు నిన్ను చంప

మహమ్మద్ జలాలుద్దీన్



టానికి ఎందుకు ప్రయత్నిస్తున్నారు? మా వల్ల నీ కేమైనా సాయం కావాలంటే చెప్పు, చేస్తాం!" అన్నారు.

"మీరు సమయానికి వచ్చారు గాని, లేకపోతే నేను నిశ్చయంగా వాళ్ళ చేతిలో చచ్చి ఉండేదాన్ని. మీ రుణం ఎలా తీర్చుకోవాలో నాకు తెలీదు," అన్నదామె.

"మేం బందిపోటు దొంగలం. నువ్వు ఎవరు?" అని దొంగలు మళ్లీ అడిగారు.

"మీరు బందిపోటు దొంగలయితే మీరూ నేనూ కూడా రాజుకు శత్రువులమే. నా పేరు రంగనాయకి. మా తండ్రి రాజు దగ్గిర కొలువుండి, రాజభటులకు సైనిక శిక్షణ ఇచ్చేవాడు. ఆయనకు నేనూ, మా అక్క మాత్రమే సంతానం. మా అక్క చాలా అందగత్తె. నేను మా నాన్న దగ్గిర శిక్షణ పొందాను. మా అక్కకు కత్తిసాములూ, గుర్రపుస్వారీలూ కిట్టేవికావు. ఆమె రాణివాసపు స్త్రీ లాగా చాలా నాజూకుగా ఉండేది. ఎప్పుడూ చక్కగా అలంకరించుకుని, అప్సరస లాగుండేది. రాజుగారి పాపిష్టి కన్ను ఆమె పైన పడింది. ఒకనాడాయన ఒక దాసీదాన్ని పంపి, రాణీగారు రమ్మంటున్నారని తన అంతఃపురానికి పిలిపించి, అక్కడే ఆమెను బందీగా ఉంచేశాడు. అదే నేనైతే వీలయినంత మందిని చంపి, చచ్చి ఉండేదాన్నిగాని రాజుకు వశమై ఉండను. రాజుగారు చేసిన పనిని మా నాన్న సహించలేక రాజుగారితో తగాదా పడ్డాడు. రాజు ఆయన మీద రాజద్రోహ నేరం మోపి, ఆయనకూ, నాకూ దేశ బహిష్కరణ శిక్ష విధించాడు. కాని మా నాన్న దేశం విడిచి వెళ్ళిపోవటాని కిచ్చిన గడువులోపలే ఆయనను రాజు రహస్యంగా చంపించాడు. నేను మాత్రం తప్పించుకుని దాక్కున్నాను. రాజును హత్యచేసిగాని చాపనని శపథం చేశాను. కాని నా కోసం రాజభటులు ఇలా కారాడుతున్నారు.

నా శపథం ఎలాతీరుతుందో తెలియదు," అన్న దామె దొంగలతో.

"మేము నిన్ను రాజభటుల నుంచి కాపాడగలం. కాని రాజు పై పగ తీర్చుకోవ టానికి మేం అంతగా సహాయపడలేమేమో!" అన్నారు వాళ్ళు రంగనాయకితో.

"అదే చాలు. అందుకు ప్రత్యుపకా రంగా మీ కొక సహాయం చెయ్యగలను. రాజుగారి కోశాగారాలు నాలుగింటికీ రహస్య మార్గాలున్నాయి. వాటిని మీకు చూపగలను. రాజుగారిని హతమార్చే అవకాశం నాకు రాకపోదు," అన్నది రంగనాయకి.

"అయితే ఇప్పుడే పోదాం. కోశాగారా నికి దారి చూపించు," అన్నారు దొంగలు.

రంగనాయకి వారిని ఒక రహస్యమార్గం గుండా తూర్పున ఉన్న కోశాగారం చేర్చింది. దొంగలు దాన్ని కొల్లగొట్టి, తమ వెంట రంగనాయకిని తమ రహస్య స్థలానికి తీసుకుపోయారు. మర్నాడు రాత్రి దాకా ఆమె వారి వెంట ఉండి, వారందరి పరి చయమూ చేసుకుని, చీకటి పడగానే దక్షిణ కోశాగారం వద్దకు తీసుకుపోయింది.

తూర్పు కోశాగారం వద్ద ఉన్నట్టే ఇక్కడ కూడా ఒక నెమలిబొమ్మ ఉన్నది. దాన్ని ఒక పక్కకు తిప్పితే తలుపు తెరుచుకుం టుంది. రంగనాయకి తలుపు తెరిచింది, కాని దొంగ లందరూ లోనికి పోగానే మళ్ళీ నెమలిని తిప్పి, తలుపు మూసేసి తన దారిన తాను వెళ్ళిపోయింది.

తాము ప్రవేశించినది కోశాగారం కాదనీ, చెరసాల అనీ దొంగలు తెలుసుకున్నారు. రంగనాయకిని కేకలుపెట్టి పిలిచారు, నోటికి వచ్చినట్టు తిట్టారు. కాని ఏమీ ప్రయోజనం లేకపోయింది.

తరవాత రాజుగారి సభలో దొంగల విచారణ జరిగింది. రాజుగారి పక్కనే రంగనాయకి కూర్చున్నది. ఆమె రాజ కుమార్తె నని దొంగలకు తెలియవచ్చింది.



# మహాదాత

ఒక గ్రామంలో ఒక ధనికుడుండేవాడు. అతను పేదలకు ఎలాటి దాన ధర్మాలూ చేసి ఎరగడు. పిసినిగొట్టుగా గొప్ప ఖ్యాతి తెచ్చుకున్నాడు.

ఒకసారి ఒక మనిషి ఆయన ఇంటికి వచ్చి ధర్మం అడిగాడు.

"మీ దేవూరు?" అని ధనికుడు ఆ మనిషిని అడిగాడు.

"ఈ వూరే," అన్నాడా మనిషి.

"అసంభవం. నేను దానధర్మాలు చెయ్యనని వూళ్ళో అందరికీ తెలుసు," అన్నాడు ధనికుడు.

ఆ గ్రామంలోనే ఒక చెప్పులుకుట్టే వాడుండేవాడు. ఎవరు యాచించినా లేదనకుండా ఇచ్చేవాడు, మహాదాత.

కొంత కాలానికి ధనికుడు మరణించాడు. గ్రామస్థులు అతని శవాన్ని దారి పక్కన పాతేశారు. అతని చావుకు ఎవరూ విచారించ లేదు.

చెప్పులు కుట్టేవాడి దగ్గిరికి మామూలు ప్రకారమే బిచ్చగాళ్ళు వస్తున్నారు. కాని అతను, "నా దగ్గిర ఏముంది ఇవ్వటానికి?" అనటం మొదలు పెట్టాడు.

గ్రామపెద్ద అతన్ని పిలిపించి, "మహాదాత అనిపించుకున్న వాడివి, అకస్మాత్తుగా దానధర్మాలు మానేశావుట, ఏమిటి కారణం?" అని అడిగాడు.

"దానధర్మాలకని నాకు ఆ చచ్చిపోయిన ధనికుడే అంతులేని డబ్బిస్తూ వచ్చాడు. ఆ డబ్బు తనదన్న సంగతి ఎవరితోనూ చెప్పనని నా చేత ప్రమాణం చేయించుకున్నాడు. ఇప్పుడాయన పోయాడు. పేదవాణ్ణి, నేనేమి ఇచ్చేది?" అన్నాడు చెప్పులు కుట్టేవాడు.





# తెలివిగల పిల్ల

పూర్వం కాంచీపురంలో కాంచనగుప్తు డనే ధనిక వ్యాపారి ఉండేవాడు. ఆయన వ్యాపారంలో సమర్థుడే గాక, మంచివాడనీ, నమ్మదగినవాడనీ కీర్తి తెచ్చుకున్నాడు.

ఆయనకు ఆనందు డని ఒక్కడే కొడుకు. ఆనందుడు కూడా మంచివాడూ, నెమ్మదైన వాడూనూ. కాని అతనిలో వ్యాపారదక్షత ఏమాత్రమూ లేదు. నల్లని వన్నీ నీళ్ళూ, తెల్లని వన్నీ పాలూ అనుకునే రకం. అతనిలో ఏ విధమైన లౌక్యమూలేదు.

ఆనందుడు పెరిగి పెద్దవాడయాడు గాని అతనికి వ్యాపారపు కిటుకు లేమీ అలవడ లేదు. అందుకు గాను అతని తండ్రి ఎంతో శ్రమపడ్డాడు కాని ఆ శ్రమ అంతా వృథా అయింది. వ్యాపారం కత్తి మీది సాము; మాట పోకూడదు, నష్టం రాకూడదు; డబ్బూ గడించాలి, మంచి పేరూ గడించాలి. ఇలా వ్యాపారం చేసే సమర్థత ఆనందుడికి అలవడ లేదు.

అందుచేత కాంచనగుప్తుడికి బెంగ పట్టుకున్నది. ఉన్నది ఒక్కడే కొడుకు. వాడికి చాత కాకపోతే, తన అనంతరం తన వ్యాపారాన్ని ఎవరు చూస్తారు? ఈ సమస్య పరిష్కారం కావాలంటే ఒకటే మార్గం ఉంది. ఆనందుడికి మంచి చురుకైన పిల్లను చూసి పెళ్లి చెయ్యాలి! పిల్ల ధనికుల ఇంటిది కానక్కర్లేదు. పెద్ద అందగత్తె కూడా కానక్కర్లేదు—మంచి తెలివితేటలు గలదై, చురుకుదనం ఉండి, వ్యాపార మర్మాలు గ్రహించగలదైతే చాలు.

అలాంటి పిల్లకోసం కాంచనగుప్తుడు వెయ్యి కళ్ళతో వెతకసాగాడు. ఆయన వ్యాపారం మీద ఎక్కడికి వెళ్లినా తనకు కోడలు కాదగిన పిల్ల కోసమే చూసేవాడు. చురుకైన పిల్ల ఎక్కడన్నా ఉంటే

బి. టి. పద్మినిదేవి

తనకు చెప్పమని తన మిత్రులతో కూడా ఆయన చెప్పి ఉంచాడు. కాని, డబ్బులాగా, అందంలాగా తెలివితేటలు చూడగానే కనిపించవు. అందుచేత ఆయన అన్వేషణ చాలాకాలం ఫలించ లేదు.

ఒకసారి ఆయన వర్ధనపురంలో జరిగే సంతకు పోవటం తటస్థించింది. ఆ సంతలో ఆయన తిరుగుతూండగా నూనెదుకాణాల దగ్గిరికి ఒక మనిషి బియ్యం మూటతో వచ్చి, "మంచి బియ్యం! భలే మంచి బియ్యం! బియ్యానికి సరికి సరి నూనె ఎవరిస్తారు?" అని కేక వేస్తున్నాడు.

"మంచి బేరమే! బియ్యం కన్న నూనె అయిదారు రెట్లు ఖరీదు. సరికి సరి నూనె ఇవ్వటానికి మేం నూనె తేరగా పెట్టుకుని కూర్చున్నా మనుకున్నావా?" అని నూనె దుకాణాలవాళ్లు ఆ మనిషిని అదిలిస్తున్నారు.

అప్పుడు ఒక దుకాణం మీద కూర్చుని ఉన్న పదహారేళ్ళ పిల్ల, "అబ్బీ, ఇలా రా! నే నిచ్చిన కొలపాత్ర నిండా బియ్యం ఇస్తావా? దానినిండా నీకు నూనె ఇస్తాను," అని పిలిచింది.

బియ్యం మూటవాడు సంతోషపడిపోతూ, సరేనన్నాడు. కాంచనగుప్తుడు అక్కడే నిలబడి మరి కొందరితో పాటు వింత చూడసాగాడు.

ఆ పిల్ల ఒక పెద్ద పళ్ళెం, కొద్దిపాటి అంచు గలది తెచ్చి, "దీన్నిండా బియ్యం పొయ్యి," అన్నది.

మూటెడు బియ్యమూ, రెండు సార్లకే పళ్ళెం నిండింది. తరవాత ఆ పిల్ల ఆ పళ్లెం అంచుల దాకా రెండుసార్లు నూనె పోసి ఇచ్చింది. చేసేది లేక బియ్యం మూటవాడు ఆ పిల్ల యిచ్చిన నూనె తీసుకుని సణుక్కుంటూ వెళ్లిపోయాడు.

చాలా లాభసాటి బేరం చేసిన ఆ పిల్లను గురించి ఆరాతీసి, ఆమెను కాంచనగుప్తుడు తన కొడుకు_ పెళ్ళి చేసుకున్నాడు.





# దయ్యాలతో మైత్రి

ఒక ఊళ్ళో చలమయ్య అనే భూస్వామికి ముగ్గురు కొడుకులు. వారిలో చివరివాడైన రంగడు తెలివి తక్కువవాడు. వాడి కెంత సేపూ దయ్యాలను చూడాలనీ, వాటితో స్నేహం చెయ్యాలనీనూ!

చలమయ్య జబ్బు చేసి మంచాన పడ్డాడు. తనకు మరణం ఆసన్నమయిందని గ్రహించి ఆయన తన పెద్ద కొడుకులతో, "నేను పోయాక రంగడు ఏమి కోరితే అది ఇచ్చి, మిగిలిన ఆస్తే మీరు పంచుకోండి," అని చెప్పాడు. తరవాత ఆయన రంగణ్ణి పిలిచి, "బాబూ, నీకు లోకజ్ఞానం లేదు. నువ్వేమడిగితే అది నీకు అన్నలు ఇస్తారు, తీసుకో. భూతదయగలిగి సుఖంగా జీవించు," అన్నాడు.

"నువ్వు చెప్పినట్టే నడుచుకుంటాను గాని నాన్నా, దయ్యాలు ఎక్కడుంటాయి?" అని రంగడు అడిగాడు.

"పాడుబడిన కొంపల్లో ఉంటాయి," అన్నాడు చలమయ్య. తన చిన్న కొడుకు అమాయికత్వానికి విచారిస్తూ.

చలమయ్య పోయాక రంగడితో వాడి అన్నలు, "ఒరే, రంగా! మనం నాన్న ఆస్తి పంచుకుందాం. నీకేం కావాలో చెప్పు, ఇస్తాం," అన్నారు.

"నాకు దయ్యాలతో స్నేహం చెయ్యాలని ఉంది. వాటికేమి ఇష్టమో అది నాకివ్వండి," అన్నాడు రంగడు.

అన్నలు ఈ మాటకు చాలా సంతోషించి, కూడబలుక్కుని, కారం మూట ఒకటి రంగడికిచ్చి, "దయ్యాల కళ్ళలో ఈ పొడి చల్లావంటే అవి నీతో స్నేహం చేస్తాయి," అని చెప్పారు.

రంగడు కారంమూట తీసుకుని అడవి మార్గం పట్టి పోసాగాడు. ఒకచోట ఒక పాడుపడిన ఇల్లూ, అందులో వెలుగూ

పఠాన్ ఖాదర్ వలీఖాన్

కనిపించింది. దగ్గిరికి వెళితే మాటలూ, ఒక స్త్రీ ఏడుపూ వినిపించాయి.

ఆ ఇంట్లో ఉన్నవి దయ్యాలై ఉంటా యనుకుని రంగడు తలుపు తట్టి, "మిత్రులారా, నేను మీ స్నేహం కోరి వెతుక్కుంటూ వచ్చాను. తలుపు తెరవండి," అని గట్టిగా కేకపెట్టాడు.

వెంటనే లోపల మాటలు నిలిచి పోయాయి. కొందరు దొంగలు పక్క ఊరిలోని సెట్టిగారి ఇల్లుదోచి, సెట్టికూతుర్ని ఎత్తుకొచ్చి, ఆమెను ఒక గుంజకు కట్టేసి, ధనం పంచుకుంటున్నారు.

ఒక దొంగ లేచి వచ్చి, తలుపు తెరిచాడు. రంగడు లోపలికి అడుగు పెట్టాడు; దొంగలను చూసి, వాళ్ళు దయ్యాలై ఉంటా రనుకున్నాడు. గుంజకు కట్టేసినది భూతమై ఉంటుందనుకున్నాడు.

"ఇదుగో, మీ కోసమే తెచ్చాను," అంటూ రంగడు కారం మూట విప్పాడు.

దొంగలు వాడి చుట్టూ మూగారు. రంగడు దొంగలందరి కళ్ళలోనూ కారం చల్లాడు. దొంగలకు కళ్లు పోయినట్టయింది.

"కట్లు విప్పు, త్వరగా!" అన్నది సెట్టి కూతురు గుణవతి.

తండ్రి భూతదయ చూపమన్నాడు గదా అని రంగడు ఆమె కట్లు విప్పాడు. వెంటనే గుణవతి రంగణ్ణి చెయ్యిపట్టుకుని బయటికి ఈడ్చుకొచ్చి, తలుపుగొళ్ళెం పెట్టింది.

తెల్లవారేసరికి ఇద్దరూ గుణవతి తండ్రి ఉండే ఊరు చేరుకున్నారు. జరిగిన సంగతంతా తెలుసుకుని సెట్టి భటులతో పాడు పడిన ఇంటికి వచ్చాడు. దొంగలు దొరికి పోయారు. పోయిన సొత్తంతా దొరికింది.

తనకు మహోపకారం చేసిన రంగడి మీద సెట్టికి ఎంతో అపేక్ష పుట్టుకొచ్చింది. గుణవతికి కూడా రంగడి మీద మనసయిందని తెలుసుకుని సెట్టి వాళ్లిద్దరికీ పెళ్లి చేసేసి అల్లుణ్ణి తన ఇంటనే ఉంచుకున్నాడు.






# ఎవరు యువరాజు?

**ఒక** రాజుకు తొలి సంతానంగా కవలపిల్లలు కలిగారు. ఇద్దరూ మగబిడ్డలే. ఇద్దరూ ఒకే పోలిక. అయితే ఒకడు కొంచెం ఎర్రగా ఉండేవాడు, రెండోవాడు పసిమి. అందుచేత వాళ్ళకు అరుణకుమారుడూ, కరుణకుమారుడూ అని పేర్లు పెట్టారు.

పెరుగుతున్న కొద్దీ వారిద్దరికీ విద్యాబుద్ధులూ, చదువు సంధ్యలూ, వీర పరాక్రమాలూ సమంగానే అలవడ్డాయి. ఇద్దరూ ఎంతో అన్యోన్యంగానూ, ఒకరి నొకరు విడవకుండానూ ఉండేవారు.

వాళ్ళను చూస్తుంటే రాజుకు, "వీళ్లలో ఎవరిని యువరాజు చెయ్యాలి?" అన్న సమస్య బయలుదేరింది. అందుకాయన ఒక ఆలోచన చేశాడు; ఇద్దరినీ పిలిచి, "మీ రిద్దరూ ఎవరికి వారుగా నగరంలోకి వెళ్లి, సాయంకాలం లోపల ఒక వంద రూపాయలు పుట్టించుకు రండి," అన్నాడు.

సరేనని ఇద్దరు కుమారులూ చెరొక దారినా నగరంలోకి బయలుదేరారు.

"వంద రూపాయలే గద? ఎవరి నడిగినా ఇస్తారు," అనుకున్నాడు అరుణుడు. అతను ఒక మిత్రుడి వద్దకు వెళ్ళి తన కొక వంద రూపాయలు ఇవ్వమని అడిగాడు.

"నా దగ్గర వంద లేవే! అరవై ఉన్నాయి," అన్నాడు ఆ మిత్రుడు.

"లాభం లేదు," అని అరుణుడు అతని డబ్బు నిరాకరించి, మరొక మిత్రుడి వద్దకు వెళ్ళాడు. అతని వద్ద ఆ అరవై కూడా లేవు. అరుణుడి మిత్రు లెపరివద్దా వందరూపాయలు హాజరుగా లేవు. ఇరవై, పదీ, అయిదూ, రెండూ ఇస్తామన్న వారే గాని వందా ఇవ్వగలిగినవాడు అరుణుడికి ఒక్కడూ కనిపించలేదు. అరుణుడు కోపం వచ్చి, కొందరిని తిట్టాడు కూడా. అతన్ని తన మిత్రులంతా అవమానం చేశారనిపించింది.

ఎస్. రామాచారి

ఒక్క ఘడియలో దొరుకుతాయనుకున్న పందరూపాయలు, సాయంకాలం కావస్తున్నా దొరకలేదు.

అప్పుడు అరుణుడికి ఒక ఆలోచన వచ్చింది. అతను తిన్నగా తమ కోశాధికారి వద్దకు వెళ్లి, తనకు నూరు రూపాయ లివ్వమన్నాడు.

"నా దగ్గిర పదిరూపాయలే ఉన్నాయి," అన్నాడు కోశాధికారి.

"నీ డబ్బు కాదయ్యా. ఖజానా నుంచి ఇయ్యి," అన్నాడు అరుణుడు.

"రాజుగారి ముద్ర లేకుండా రాజుగారి కైనా ఖజానా నుంచి ఒక్క పైసా ఇచ్చే అధికారం నాకు లేదు, బాబూ," అన్నాడు కోశాధికారి.

అరుణుడు హతాశుడయాడు.

సాయంకాలం అయింది. రాజుగారు తన కొడుకులను పిలిపించి, "డబ్బు తెచ్చారా?" అని అడిగాడు.

అరుణుడు నూరు రూపాయలు పుట్టించ లేక పోయాడు. అతను జరిగినదంతా తండ్రికి చెప్పాడు.

కరుణుడు మాత్రం నూరురూపాయలు తెచ్చి తండ్రికి చూపాడు.

"నువ్వీ డబ్బు ఎలా తెచ్చావు?" అని రాజు అడిగాడు.

"నేను నా స్నేహితుల వద్దకు వెళ్ళి, నాకు డబ్బు కొంచెం కావాలనీ, ఇవ్వగలిగి నంత ఇవ్వమనీ అన్నాను. కొందరు పదు లిచ్చారు, కొందరు అయిదు లిచ్చారు, కొందరు రెండేసీ, ఒక్కొక్కటీ కూడా ఇచ్చారు. నూరు పూర్తికాగానే వచ్చేశాను," అన్నాడు కరుణుడు.

అధికారం చలాయించకుండా, అవతలి వాళ్ళకు ఎలాంటి ఇబ్బందీ కలగకుండా, తన పని సక్రమంగా పూర్తిచేసిన కరుణ కుమారుణ్ణే యువరాజుగా అభిషేకించాలని రాజు నిశ్చయించాడు.





# కృష్ణావతారం

ఒకనాడు తెల్లవారుఝామున కృష్ణుడు సాత్యకినీ, ఉద్ధవుణ్ణీ వెంటబెట్టుకుని సభకు బయలుదేర బోతూండగా, ఎవరో ఒక మనిషి అతని దర్శనార్థమై వచ్చాడు. ద్వారపాలకుల వెంట వచ్చిన ఆ మనిషి, "దేవా, మగధదేశాన్ని పాలించే జరాసంధుడు ఇరవైవేలమంది రాజులను జయించి, చెరలో పెట్టి, నానా హింసలూ పెడుతున్నాడు. వారందరూ నిన్ను శరణు వేడుతూ, నన్ను తమ ప్రతినిధిగా పంపారు. మేమందరమూ నీ ప్రజలమే గనక, మమ్మల్ని రక్షించేభారం నీదే," అన్నాడు.

అదే సమయంలో ఆకస్మికంగా నారదుడు వచ్చాడు. కృష్ణుడు నారదుడికి అతిథి మర్యాదలన్నీ చేసి, విశేషాలేమిటని అడిగాడు. అప్పుడు నారదుడు, "పాండవాగ్రజుడైన ధర్మరాజు రాజ్యం సంపాదించ గోరి రాజసూయం తలపెట్టాడు. దానికి నీవే అధ్వర్యం వహించాలని కోరుతున్నాడు. నీ రాక కోసం రాజులందరూ ఎదురు చూస్తున్నారు," అన్నాడు.

ఒక వంక జరాసంధుడి చేత చెర పెట్టబడిన రాజులు కృష్ణుడి సహాయం అర్థిస్తూ దూతను పంపారు. అదే సమయంలో ధర్మరాజు చేసే రాజసూయానికి అధ్వర్యుడుగా ఉండమని నారదుడి ద్వారా పిలుపు వచ్చింది.

"మనం ఈ రెంటిలో ఏది ప్రథమ కర్తవ్యంగా భావించాలి?" అని కృష్ణుడు ఉద్ధవుణ్ణి సలహా అడిగాడు.

## 28. రాజసూయం





"జరాసంధుణ్ణి చంపటానికి వేరే పని పెట్టుకుని వెళ్ళవలిసిన పని ఉండదు. ఎందుచేతనంటే, ధర్మరాజు రాజసూయం చేసేటప్పుడు ఎలాగూ అనేకమంది రాజులను జయించవలసి ఉంటుంది. పనిలో పనిగా జరాసంధుడి సంగతి కూడా చూడ వచ్చు. రాజసూయానికి వెళ్ళటమే మంచిది. ఆ విధంగా రెండు కార్యాలూ నెరవేరుతవి," అన్నాడు ఉద్ధవుడు.

ఉద్ధవుడు మరొక సంగతి కూడా గుర్తు చేశాడు: జరాసంధుడి పైకి సేనలతో వెళ్ళి గెలవటం సాధ్యం కాదు. బలంలో ఆ జరాసంధుడికి తుల్యుడైన ఏ భీముడో ద్వంద్వ యుద్ధంలో జయించవలిసిందే. మరో మార్గం లేదు.

ఉద్ధవుడి సలహా కృష్ణుడికి నచ్చింది. అతను బలరాముడి అనుమతి పొంది, స్త్రీలతో సహా ఇంద్రప్రస్థానికి ప్రయాణ సన్నాహాలు సాగించమని దారుకుడు మొదలైన వారికి ఉత్తరువిచ్చాడు. కృష్ణుడు చతురంగ బలాలనూ, పల్లకీలలో రుక్మిణీ, సత్యభామా మొదలైన స్త్రీ జనాన్నీ వెంట పెట్టుకుని అట్టహాసంగా తరలి వెళ్ళాడు. బయలుదేరే ముందు నారదుణ్ణి పంపేసి, తన వద్దకు వచ్చిన దూతతో, "మీ రాజులను భయపడవద్దని చెప్పు. నేను తప్పక జరాసంధుణ్ణి చంపించి, మీ రాజులకు స్వేచ్ఛ ఇస్తాను," అని అతన్ని కూడా సాగనంపాడు.

కృష్ణుడు వస్తున్న వార్త విని ధర్మరాజు ఎదురు వెళ్ళి, ఆనందబాష్పాలు కారుస్తూ కృష్ణుణ్ణి ఆలింగనం చేసుకున్నాడు.

కృష్ణుడు పాండవులను తగిన విధంగా పరామర్శించి, జెండాలతోనూ, తోరణాలతోనూ, అరటిచెట్లతోనూ అలంకరించిన వీధుల వెంబడి ఇంద్రప్రస్థం ప్రవేశించాడు. కృష్ణుణ్ణి చూడటానికి పౌరులు వీధుల వెంబడీ, మిద్దెల మీదా గుమికూడారు.





ధర్మరాజు ఇంట కృష్ణుడు కుంతినీ ఆమె కోడళ్ళనూ చూశాడు.

పాండవులకు కృష్ణుడు ఎంతో అప్తుడు. కృష్ణార్జునుల స్నేహం లోకోత్తరమైనది. అర్జునుడు ఖాండవదహనం చేయించి నప్పుడు కృష్ణుడు స్వయంగా అతనికి సారథ్యం చేశాడు; అతనికి దివ్యమైన రథమూ, గుర్రాలూ, అక్షయతూణీరాలూ ఇప్పించాడు; మయుడి చేత మయసభ నిర్మింపజేసి పెట్టాడు. అందుచేత ధర్మ రాజు చాలాకాలం పాటు కృష్ణుణ్ణి సపరి వారంగా తన వద్ద ఉంచుకుని, చివరకు ఒకనాడు, తాను తలపెట్టిన రాజసూయం గురించి నిండుసభలో కృష్ణుడితో ప్రస్తా వించాడు.

కృష్ణుడు ధర్మరాజును అభినందిస్తూ, "నువు రాజసూయం చెయ్యటానికి ఆక్షే పణ ఏమున్నది? దిగ్విజయం చెయ్యటానికి దిక్పాలకుల వంటి నీ తమ్ములున్నారు. వాళ్ళు నీకు నాలుగుదిక్కులూ గెలిచిపెట్ట గలరు," అన్నాడు.

ఆ మాట విని ధర్మరాజు చాలా సంతో షించి, నలుగురు తమ్ములనూ నాలుగు దిక్కులూ జయించి రావటానికి పంపాడు. సహదేవుడు దక్షిణానికీ, నకులుడు పడ



మరకూ, అర్జునుడు ఉత్తరానికీ, భీముడు తూర్పుకూ వెళ్ళి ఆయా దిక్కుల గల రాజులను గెలిచి, రాజసూయం కొనసా గించటానికి అంతులేని ధనాలను తెచ్చి ధర్మరాజు కిచ్చారు.

రాజులందరూ ఓడారు గాని, జరాసం ధుడు ఓడలేదు. ఇది ధర్మరాజుకు విచార కారణ మయింది. అది చూసి కృష్ణుడు, "జరాసంధుడి విషయం దిగులుపెట్టుకో వద్దు. అతన్ని జయించే ఉపాయం నే నిక్కడికి బయలుదేరే ముందే ఉద్ధ వుడు చెప్పాడు. ఆ పని నేను నెరవేరు స్తాను," అన్నాడు.



అతను భీముణ్ణీ, అర్జునుణ్ణీ వెంటబెట్టుకుని, జరాసంధుడి రాజధాని అయిన గిరివ్రజపురం వెళ్ళాడు. అక్కడ ముగ్గురూ బ్రాహ్మణ వేషాలు ధరించారు. జరాసంధుడు రోజూ బ్రాహ్మణ పూజ చేస్తాడు. అతను ఆ పనిలో నిమగ్నుడయి ఉండే సమయంలో వీళ్ళు అతని వద్దకు వెళ్ళి, "మేం దూరదేశం నుంచి వచ్చిన అతిథులం. మేము కోరినది ఇయ్యి," అన్నారు.

జరాసంధుడు వాళ్ళను శ్రద్ధగా చూశాడు. ఆ ముగ్గురి ఆకారాలూ, కంఠస్వరాలూ పరిచితమైనవిగానే వున్నాయి. వాళ్ళ ముంజేతులు కాయలుగాచి ధనుర్బాణాలు ఉపయోగించే రాజుల కున్నట్టుగా ఉన్నాయి. వాళ్ళు నిస్సందేహంగా బ్రాహ్మణవేషాలు ధరించిన క్షత్రియులే!

అయినా జరాసంధుడు వాళ్ళ కోరిక తీర్చటానికే నిశ్చయించుకుని, "మీకేం కావాలి?" అని అడిగాడు.

"మాకు కావలసింది నీతో ద్వంద్వ యుద్ధం. ఇతను భీముడు. ఇతను అతని తమ్ముడు అర్జునుడు. నేను నీ పగవాణ్ణి, కృష్ణుణ్ణి," అన్నాడు కృష్ణుడు.

ఈ మాటలు విని జరాసంధుడు నిర్లక్ష్యంగా నవ్వి, "అలా అయితే ద్వంద్వ యుద్ధం చేస్తాను. కాని నీతో చెయ్యను— నన్ను చూసి మధుర నుంచి పారిపోయి, సముద్రంలో దాక్కున్న పిరికిపందవు! ఈ అర్జునుడితోనూ యుద్ధం చెయ్యను. ఇతను నా కన్న చిన్నవాడు. అదీగాక బలంలో అతను నాకు చాలడు. నాతో భీముడు సమానుడు. అతనితో ద్వంద్వ యుద్ధం చేస్తాను," అన్నాడు.

జరాసంధుడు ఒక ఉద్దండమైన గదను భీముడి కిచ్చి, అలాటిదే తాను కూడా తీసుకున్నాడు. కృష్ణార్జునులతో సహా వారిద్దరూ నగరం దాటి యుద్ధభూమికి వెళ్ళారు. అక్కడ భీమ జరాసంధులు గదా యుద్ధం



ప్రారంభించారు. ఒకరిదెబ్బలు ఒకరు తప్పుకుంటూ, అవకాశం దొరికినప్పుడు ఒకరి నొకరు గదలతో మోదుకుంటూ ఆ ఇద్దరూ రెండు మదించిన ఏనుగుల్లాగా పోరాడారు. చివరకు ఇద్దరి గదలూ విరిగి పోయాయి. అప్పుడు వారు ముష్టియుద్ధం సాగించారు.

జరాసంధుడు పుట్టినప్పుడు రెండు చీలికలై పుట్టాడు. జర అనే పిశాచి ఆ రెండు చీలికలనూ కలిపింది. అందుచేత అతనికి జరాసంధు డనే పేరువచ్చింది. ఈ సంగతి కృష్ణుడు ఎరుగును. అతన్ని చంపటానికి కూడా రెండుగా చీల్చటమే మార్గమని



భీముడికి తెలియ జెప్పటానికై, కృష్ణుడు ఒక పుల్ల తీసుకుని రెండుగా చీల్చాడు. ఈ సంకేతం భీముడికి అర్థమయింది. భీముడు జరాసంధుణ్ణి కింద పడదోసి, ఒక కాలిని తన కాలితో తొక్కిపెట్టి, రెండో కాలు పట్టుకుని జరాసంధుణ్ణి నిలువుగా చీల్చాడు.

యుద్ధాన్ని చూడవచ్చిన జనులు రెండు చీలికలైపోయిన జరాసంధుణ్ణి చూసి హాహాకారాలు చేశారు.

కృష్ణార్జునులు భీముణ్ణి కౌగలించుకుని, అభినందించారు.

జరాసంధుడు చచ్చిన మీదట కృష్ణుడు జరాసంధుడి కొడుకైన సహదేవుణ్ణి మగధ రాజ్యానికి రాజుగా అభిషేకించి, జరాసంధుడు చెరపెట్టిన రాజులందరినీ విడిపించాడు. కృష్ణుడు చెప్పిన మీదట సహదేవుడు ఆ రాజులందరికీ స్నానపానాలు ఏర్పాటు చేసి, మంచి కానుకలిచ్చి సత్కరించి, వాళ్ళ వాళ్ళ దేశాలకు పంపేశాడు.

కృష్ణుడు భీమార్జునులను వెంట బెట్టుకుని ఇంద్రప్రస్థానికి తిరిగి వచ్చి, జరాసంధుడి మరణవార్త ధర్మరాజుకు చెప్పాడు. తన కోరిక సిద్ధించినందుకు ధర్మరాజు సంతోషించి, కృష్ణుణ్ణి రకరకాల స్తోత్రం చేశాడు.









తరవాత ధర్మరాజు రాజసూయ యాగం ఆరంభించాడు. దానికి ఋత్విక్కులు కృష్ణ ద్వైపాయనుడూ, భరద్వాజుడూ, వసిష్ఠుడూ, విశ్వామిత్రుడూ, గౌతముడూ మొదలు గాగలవారు అనేకమంది.

యాగానికి ధర్మరాజు భీష్మణ్ణీ, ధృతరాష్ట్రుణ్ణీ, ఆయన కొడుకులనూ, ద్రోణుడూ, కృపుడూ, విదురుడూ మొదలైన వారినీ పిలిపించాడు. అనేకమంది రాజులూ, నాలుగు కులాలవారూ కూడా వచ్చారు.

బంగారు నాగళ్ళతో యజ్ఞభూమి దున్ని, వేదిక మొదలైనవి ఏర్పాటు చేసి, ఋత్విక్కులు ధర్మరాజు చేత యజ్ఞదీక్ష ధరింపజేశారు. రాజసూయం చాలా వైభవంగా జరిగింది. యజ్ఞకర్త సదస్యులనూ, యాజకులనూ సత్కరించవలసిన రోజు వచ్చింది. ఆ రోజు ధర్మరాజు సదస్యులను, "తమ అందరిలోనూ ప్రథమ పూజార్హు డెవరో నిర్ణయించండి," అని అడిగాడు.

కాని ఆ ప్రశ్నకు ఎవరూ సమాధానం చెప్పలేకపోయారు. ఎందుచేతనంటే సభలో ఎందరో మహాత్ములున్నారు. అందరూ నోళ్ళు కట్టుపడి ఉన్న సమయంలో సహదేవుడు, సభను ఉద్దేశించి, "దీని కింత ఆలోచన దేనికి? భగవంతుడైన కృష్ణుడే ప్రథమ పూజార్హుడు. అతన్ని పూజిస్తే సర్వ భూతాలనూ పూజించినట్టే," అన్నాడు.

సహదేవు డన్న ఈ మాటకు సభాసదు లందరూ తమ ఆమోదం తెలిపారు. ధర్మరాజు వెంటనే కృష్ణుడి కాళ్ళు కడిగి, అతనికి పచ్చని పట్టుబట్టలూ, ఆభరణాలూ పెట్టాడు. మిగిలిన రాజు లందరూ కృష్ణుడికి నమస్కారాలు చేశారు.

కాని ఇదంతా దమఘోషుడి కొడుకైన శిశుపాలుడికి కొంచెం కూడా నచ్చలేదు. అతను చివాలున లేచి నిలబడి, చెయ్యెత్తి, "కాల ప్రభావం కాకపోతే ఆ కుర్రకుంక చెప్పటమేమిటి, మీరంతా అవునట



మేమిటి? ఇంతమంది మేటి తపస్వులున్న ఈ సభలో, కులపాంసనుడైన ఈ గొల్ల వాడికి ప్రథమ పూజ చేయవచ్చునా? యయాతి శాపం పొందిన యాదవులు పరమ హీనులు గద?" అంటూ పేలాడు.

కృష్ణుడు చలించ లేదు. కాని మిగిలిన వారిలో కొందరు చెవులు మూసుకుని సభ నుంచి లేచిపోయారు. మరి కొందరు శిశు పాలుడితో యుద్ధానికి తలపడ్డారు. కృష్ణుడు వారి నందరినీ వారించి, తన సుదర్శన చక్రం ప్రయోగించి, శిశుపాలుడి తల నరి కేశాడు. గగ్గోలు పుట్టింది. శిశుపాలుడి పక్షం వారంతా పారిపోయారు.

ధర్మరాజు అందరికీ సక్రమంగా దానాలు చేసి, అవభృతస్నానం చేసి యజ్ఞం పరిసమాప్తి చేశాడు.

రాజసూయం చూడటానికి వచ్చిన రాజు లందరూ వెళ్ళిపోయాక కూడా, ధర్మరాజు కోరికపై కృష్ణుడు ఉండిపోయాడు.

ఈలోపల దుర్యోధనుడు అసూయతో కుమిలి పోసాగాడు. ఎందుకంటే, ధర్మ రాజు విభవాన్ని తాను కళ్ళారా చూశాడు. రాజసూయం మహా గొప్పగా జరిగింది. మయుడు ధర్మరాజుకు అద్భుతమైన సభ నిర్మించాడు. ఆ సభలో పాండవులకు ఎక్క డెక్కడి రాజులూ కైంకర్యం చేశారు. అందులో కృష్ణుడి భార్యలు విహారాలు చేశారు. ఆ సభలోనే దుర్యోధనుడు పరా భవం కూడా పొందాడు. అందులో ఎక్కడ నీరున్నదీ, ఎక్కడ నేల ఉన్నదీ సరిగా తెలియరాలేదు. దుర్యోధనుడు నీరులేని చోట బట్టలు పైకి తీసుకున్నాడు; నీరున్న చోట బట్టలు తడిసేలాగ దిగబడ్డాడు. కృష్ణుడు నవ్వాడు. అది చూసి అందరూ, స్త్రీలతో సహా నవ్వారు. ధర్మరాజు నవ్వ వద్దని వారించాడుగాని, ఎవరూ లక్ష్య పెట్ట లేదు. పుట్టెడు అవమానం పొంది దుర్యో ధనుడు హస్తినాపురానికి తిరిగి వెళ్ళాడు.





# అరణ్యపురాణం

## 31

ఎర్రశునకులతో పోరాటమూ, అకేలా మరణమూ జరిగి ఏడాది వెళ్ళిపోయింది. మౌగ్లీ కిప్పుడు పదిహేడో ఏడు నిండబోతున్నది. కాని అతను ఈడుకు మించి కనిపించే వాడు. దానికి కారణం అతని అపార శరీర దార్ఢ్యమూ, మంచి ఆహారమూనూ. అతి వేగంగా దూకుతూ పోతున్న జింకను అతను తల పట్టుకుని పడదోయగలడు. అరణ్యం లోని ప్రాణులు అతని దారికి అడ్డు తొలుగుతారు. వాళ్ళకు అతనంటే చెడ్డ భయం.

శీతాకాలం అయి పోయి, వసంత కాలం రాబోతున్నది. వాయిన్‌గంగ ఒడ్డున ఒక ఎత్తయిన గుట్ట మీద బాఘీరా, మౌగ్లీ పడుకుని ఉన్నారు.

"పాత సంవత్సరం అయి పోయి కొత్త సంవత్సరం ఆరంభం కానున్నది. కొత్త పాటలు పాడే తరుణం దగ్గిర పడింది. అరణ్యానికి కొత్త జీవం వస్తుంది," అంటూ బాఘీర వెల్లికిలా పడుకుని, గాలిని కాళ్ళతో కొట్ట సాగాడు.

"అదేం పని? నువ్వూ, నేనూ అరణ్యానికి ఏలికలం గద! సిగ్గుచేటుకాదూ?" అని మౌగ్లీ బాఘీరను మందలించాడు.

బాఘీర సరిగా లేచి కూర్చుని, "కొత్త పాటల సమయం వస్తున్నదని చెప్పాను గద!" అన్నాడు.

"అవును! మీ రంతా నన్ను ఒంటరిగా విడిచిపోతారు. కిందటిసారి ఏం జరిగింది? పొలాల నుంచి చెరుకుగడలు తెమ్మని హాథీకి కబురు చేస్తే, రెండు రోజులయాక వచ్చాడు. ఈ లోపల అతను ఘీంకరిస్తూ చెట్ల మధ్యగా పరుగులు తీయటమూ, వెన్నెట్లో తందనాలు వెయ్యటమూ తప్ప చేసినదేమీ లేదు," అన్నాడు మౌగ్లీ.

అట్ట చివరి బొమ్మ



"కొత్త పాటల తరుణమంటే అంతే!" అన్నాడు బాఘీర.

వసంతా గమనంతో అరణ్యానికి ఒక నూతన శోభ వచ్చింది. అరణ్యవాసులు ఎంతో ఉల్లాసంగా ఉన్నారు. వాళ్ళ కంఠ ధ్వనులే మారిపోయాయి. మామూలుగా ఈ రుతువులో మౌగ్లీ కూడా ఎంతో ఉల్లాసంగా ఉండి, అరణ్యంలోపడి ఎన్నో మైళ్లు పరిగెత్తేవాడు.

కాని ఈసారి అతనిలో ఉత్సాహం లేదు. తిన్న తిండి కడుపులో రాయి పెట్టినట్టున్నది. మనసులో ఏదో చిరాకు. బాఘీరతో తాను చిరాకుపడి ఎందుకు మాట్లాడాడో మౌగ్లీకి



అర్థం కాలేదు. అతని శరీరంలో జబ్బు లక్షణాలేవీ లేవు. తాను తప్ప మిగిలిన అరణ్య వాసులందరికీ వెర్రి పట్టుకున్నట్టుగా ఉన్నది!

వసంతంలో యౌవనంలో ఉన్న తోడేళ్లు ఒకరితో ఒకరు యుద్ధాలు చేస్తారు; మందకు తెలియకుండా ఏ కాంత ప్రదేశంలో పోట్లాడు కుంటారు. ఈ సంగతి మౌగ్లీకి తెలుసు. తెలిసి కూడా అతను, పోట్లాడుకోబోతున్న ఇద్దరు తోడేలు యువకుల మధ్యకు వెళ్లి, వాళ్ళను వేరు చెయ్యాలని చూశాడు. ఇద్దరూ ఏకమై మౌగ్లీని పక్కకు నెట్టేసి, మరుక్షణం కలియబడ్డారు.

మౌగ్లీకి చప్పున కోపం వచ్చింది. అతను ఒర నుంచి కత్తి పైకిలాగి, క్రోధంతో పళ్ళు బయట పెట్టాడు. ఇద్దరు తోడేళ్ళనూ చంపెయ్యాలని అతని ఉద్దేశం. కాని అతని కేదో నీరసం వచ్చేసింది. కత్తి తిరిగి ఒర లోకి వెళ్లిపోయింది.

"నే నేదో విషం తిన్నాను. ఇన్నాళ్ళూ నన్ను నెట్టెయ్యగల తోడేలు ఉండటం నే నెరగను. ఈ ఇద్దరు అర్భకులు నన్ను అవలీలగా తోసి పారేశారు! నాలో బలం లేదు. నేను త్వరలోనే చచ్చిపోతాను," అనుకున్నాడు మౌగ్లీ.

ఆ సాయంత్రం అతను వేటాడాడు గాని, తిండి సయించలేదు. ఆ రాత్రి పండు వెన్నెల. అరణ్యమంతటా కొత్త పాటలూ, పోట్లాటలూ సాగుతున్నాయి. ఇలాంటి రాత్రి పరుగు తియ్యటం మౌగ్లీ అలవాటు. అతను గొంతెత్తి గట్టిగా పాడుతూ, అరణ్యం మధ్యగా ఉత్తరాన ఉన్న ఊబుల కేసి పరిగెత్తాడు—ఎగరటంలాటి పరుగు.

అతను త్వరలోనే ఊబులను చేరి, వాటి మధ్యకు వెళ్లి, తుంగల మధ్య కూర్చున్నాడు. అరణ్యంలోనే వదిలేశాననుకున్న విషాదం అతన్ని మళ్ళీ ముంచెత్త సాగింది. తాను నిశ్చయంగా విషం తిని ఉంటాననుకున్నాడు. ఆ రెండు తోడేళ్ళూ పోట్లాడుకునేటప్పుడు తనకు భయం వేసింది. ఇదే అకేలా గాని, ఫావో గాని అయితే భయపడతారా ?

అతని కిప్పుడు చావు భయం కూడా పట్టుకున్నది. ఈ ఊబి గుంటల మధ్య తన శవం తేలుతుందా ? అరణ్యంలో ఉన్న గుట్ట మీదికి పోయి చావటం మేలనీ, అకేలాను గద్ద పీక్కుతిన్నట్టు తనను కూడా తినకుండా తన శవాన్ని బాఘీర కాపాడతాడనీ అనిపించింది.

అతని కంట ఒక పెద్ద అశ్రుకణం రాలింది. ఆ దుఃఖంలో అతని కేదో సంతుష్టి



కనబడింది. అతనికి అకేలా చస్తూ అన్న మాటలు గుర్తు వచ్చాయి. మనుషుల వద్దకు తిరిగి పొమ్మన్నాడు అకేలా మౌగ్లీని.

"అవసానదశలో అకేలా మతి పోయి ఏమిటో అన్నాడు. నేనే అరణ్యాన్ని!" అని మౌగ్లీ పైకే గట్టిగా అనేశాడు.

తుంగల మధ్య నుంచి ఒక అడవి గేదె, "మనిషి!" అన్నది.

దాని వెంట ఉన్న దున్న తల ఎత్తి చూసి, "ఛీ, మనిషి కాదు! సియోనీ మంద వెంట ఉండే బొచ్చులేని తోడేలు!" అనటం మౌగ్లీ విన్నాడు. ఆ దున్న పేరు మైసా. మౌగ్లీ అతన్ని ఎరుగును.

మైసా అన్న మాటలకు కోపం వచ్చి మౌగ్లీ తుంగ మధ్యగా వెళ్ళి, తన కత్తితో మైసాను పొడిచి, మైసా బాధతో అరుస్తుంటే, గట్టిగా నవ్వుతూ, "సియోనీ మందలో ఉండే బొచ్చులేని తోడేలు నిన్ను ఒకప్పుడు తోలాడను!" అన్నాడు.

"నువా! తోడేలువా! చాల్లే! నువు పెంపుడు జంతువుల్ని తోలేవాడివని అరణ్యాని కంతకూ తెలుసు. నువు నిజమైన వేటగాడివే అయితే పాములా పాకి వచ్చి, ఆడకూతురి దగ్గిర నాకు అవమానం చేస్తావా?" అన్నాడు మైసా.

"నాకీ ప్రాంతం కొత్త. ఇటెక్కడన్నా మనిషిమంద ఉందా, మైసా?" అని అడిగాడు మౌగ్లీ.

"ఉత్తరంగా పో. ఊబి దాటాక గ్రామం ఉంది," అన్నాడు మైసా.

మౌగ్లీ ఊబి దాటి ఒక విశాలమైన మైదానం చేరాడు. అతనికి దూరంగా దీపం కనబడింది—ఎర్రపువ్వు! అతను మనుషుల విషయం ఆలోచించి చాలాకాలమయింది. కాని ఇప్పుడా "ఎర్రపువ్వు" అతన్ని ఆకర్షిస్తున్నది. "మనిషి మంద ఏ మాత్రం మారిందో చూడాలి," అనుకుంటూ అతను ముందుకు సాగాడు.



# 85. సింహళ బౌద్ధాలయం

రువన్వెలి బౌద్ధాలయం అనూరాధపురాలో 2,000 ఏళ్ళనాడు గొప్ప యోధుడైన రాజుచేత నిర్మించబడింది. దీని నిర్మాణానికి కోట్లకొద్దీ ఇటుకలు వాడారు. దీని పునాదిలో బంగారు, వెండి ఇటుకలున్నాయట. దీని ఎత్తు 180 అడుగులు. ఉత్సవ సమయంలో యాత్రికులు దీని పైకి పోతారు.



Photo by A. V. Rangaiah



బహుమతి
పొందిన వ్యాఖ్య

హాయిగా గడిపిన రోజు

పంపినవారు:
జి. హైమవతి, నెల్లూరు

Photo by P. Jayaraj



బహుమతి
పొందిన వ్యాఖ్య

రాయిగా మారిన రాజు

పంపినవారు :
జి. హైమవతి, నెల్లూరు

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1969 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ డిసెంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: హాయిగా గడిపిన రోజు

రెండవ ఫోటో: రాయిగా మారిన రాజు

పంపినవారు: జి. హైమవతి,

130, కాపు వీధి, నెల్లూరు.

బహుమతి మొత్తం రు. 10/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# దిలీప్
# అతడి స్నేహితులు

చేపలువస్తే అద్భుతకథ

చేపలవేటకు వెళ్లి తిరిగి వస్తున్న దిలీప్ బృందం. రైల్వే పట్టాలదగ్గర ఫిష్‌ప్లేట్లు లేకపోవటం గమనించారు. రైలువస్తే, యీ విషయం హెచ్చరించటం ఎలా?

నేను ఉపాయం చెబుతాను! ఒరేయ్ సురేష్ నువ్వు తొడుక్కున ఎర్రచొక్కా ఇలా ఇయ్యి.

ఎందుకు ఏంచేస్తావు కుస్తీ పడతావా.

దానికంతా టైములేదు, ఇప్పుడు! ఇదుగో ఆ గాలపు కర్ర ఇయ్యి!

ఎర్రజండా తయారుచేస్తున్నాను.

ఏదైనా రైలుబండివస్తే అపదలేకుండా ఆగిపోతుంది.

సరేగాని దాన్ని ఎలానిలబెడతావు మరి

భూమిని త్రవ్వుదాంరా

కాని డ్రైవరుకు ఏలాతెలుస్తుంది అది ఎర్ర సిగ్నల్ అని.

కంగారుపడకు-ఎవరెడి ఆ పనినిచేసేస్తుంది. నేను బ్యాటరీని వేస్తాను జండామీదికి అది ఎర్రగా కనిపిస్తుంది.

ఇంక కొంచెంవుంది చూదాం ఏం జరుగుతుందో.

వచ్చేవారము: రైలు వస్తూంది. అది సిగ్నల్ చూస్తుందా?

అతి తెల్లనైనకాంతి, అతి స్థిరమైన శక్తి, అది ముమ్మాటికీ 'ఎవరెడి'

UC-4348

# వాయిదాలపై ట్రాన్సిస్టర్లు



రూ. 320/- ఖరీదుచేసే, లోకప్రసిద్ధి చెందిన 'ఎస్కార్ట్' 3 బ్యాండ్ అఖిల ప్రపంచ పోర్టబుల్ ట్రాన్సిస్టరును నెలకు రూ.10/-లు చొప్పున వాయిదాల పద్ధతిని తెప్పించుకోండి. భారతదేశంలో ప్రతి పల్లెకూ, పట్టణానికి కూడ పంపగలము.

వివరములకు:

**JAPAN AGENCIES** (CM-M. 10)
**POST BOX 1194 :: DELHI-6**



## పొదుపునకు...

ప్రకాశవంతంగా, పరిశుభ్రంగా చిరకాలం, పొదుపుగా పని చేసే లాంపు.

ఎల్లపుడును వాడండి

## బెంగాల్

ఇండియాలో శ్రేష్టమైనది
బెంగాల్స్ కాయిల్డ్ కాయిల్ లాంపులే
ఎల్లపుడు వాడండి. నమ్మకమైనది.

మీకు చల్లని, ప్రకాశవంత మైన వెలుగునిచ్చే లాంపు

## బెంగాల్ హంస



పాలతెలుపు లాంపు.

ఆంధ్రప్రదేశ్‌కు సోల్ సెల్లింగ్ ఏజెంట్లు:
**జి.ఎ. పరశురామ్ & కంపెని.**
11-4-658/2, లకడికాపూల్. హైదరాబాద్-4. A.P.

బెంగాల్ ఎలెక్ట్రికల్ కంపెనీ, బెంగళూరు - 3 & మదరాసు - 17

## పియన్‌బి
## మీకు
## ఉజ్వలమైన
## భవిష్యత్తుని యిస్తుంది



PR-PNB-6810 TE-1

చిన్న ఆమొక్క ఎంతో చిన్నదిగా వుండేది. అయితే ఈనాడు పెరిగి యింత పెద్దదైంది.
సరైన శ్రద్ధచూపిస్తే పెరుగుదల ఎప్పుడూ త్వరితంగా జరుగుతుంది.

మీ చిన్న పొదుపు మొత్తాల ఎక్కౌంటుకూడా యిదేమాదిరిగా త్వరితంగా పెరుగుతుంది.
మొదట్లో అది ఎంత చిన్నదైనప్పటికీ కూడా క్రమక్రమంగా అది పెరిగి పెద్దదై తీరుతుంది.
ఎన్నో మీ అవసరాలని అది తీరుస్తుంది. మీ బిడ్డ ఉన్నతవిద్యకోసమో, మీకూతురు
వివాహం కోసమో, కుటుంబ సౌఖ్యంకోసం సోపానాలు వేసేందుకో మీ సేవింగ్స్
ఎక్కౌంట్‌లోని మొత్తం మీకు ఎంతో వుపయోగ పడుతుంది.

మీకు అతిదగ్గరలోవున్న పియన్‌బి బ్రాంచికి వెళ్ళియిప్పుడు పొదుపు చేయ్యటం ప్రారంభించండి. మాకు దేశమంతటా 500కు మించి బ్రాంచీలు వున్నాయి.

**పంజాబ్ నేషనల్ బ్యాంక్**

1895 నుంచీ జాతికి సేవచేస్తున్నది

బ్యాంకు చైర్మన్ : యస్. సి. త్రిఖా

85

# AWARDS!
# WON PLENTY

YET WE DON'T SAY
WE ARE THE BEST

ONLY
WE DO OUR BEST




**PRASAD PROCESS PRIVATE LTD**
CHANDAMAMA BUILDINGS MADRAS-26

